

# వైదిక నిత్యకర్మవిధి

## వేద మంత్రపుష్పము



సంపాదకురాలు

డా॥ శ్రీమతి సంధ్యావందనం లక్ష్మీదేవి



ప్రకాశకులు

సంధ్యావందనం సంస్కార సందేశం

ప్లాట్ నెం. 39, సూర్య నగర్,

కౌసల్య ఎస్టేట్, కార్ఖానా, సికింద్రాబాద్ - 500 009

ఫోన్ : 040 - 27741299,

సెల్ : 8019752118

సంధ్యావందనం సంస్కార సందేశం - 8

## వైదిక నిత్యకర్మ విధి

డా॥ సంధ్యావందనం లక్ష్మీదేవి



స్వస్తిశ్రీ జయనామ సంవత్సర ఉత్తరాయణ శిశిర ఋతువు మాఘ శుద్ధ శ్రీ రథసప్తమీ గణతంత్ర దివసము తేది 26-1-2015 సోమవారం.

ప్రథమ ముద్రణ : 2015

ప్రతులు : 2000

వెల : అమూల్యము

ముఖ చిత్రం : కృష్ణమోహన్
9912333099

ముద్రణ : కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
040-27618261

టైప్ సెట్టింగ్ : దామరాజు నాగలక్ష్మి
సెల్ : 9912940182

ప్రతులకు :

ఆర్య మహిళా సమితి

శ్రీమతి సుజాత - సెల్ : 9160260064

శ్రీమతి పద్మావతి - సెల్ : 9440121325

శ్రీమతి లక్ష్మీదేవి - సెల్ : 8019752118, ఫోన్ : 040-27741299



## పురంధర్ యోషా॥ (యజుర్వేదం)

### స్త్రీలు బహుముఖ ప్రజ్ఞావంతులు

## ఆర్య మహిళా సమితి సౌజన్యంతో



**యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః**



# సమర్పణ

ఋషి యజ్ఞం దేవయజ్ఞం భూతయజ్ఞంచ సర్వదా॥
నృ యజ్ఞం పితృయజ్ఞం చ యథాశక్తి నహాపయేత్॥

(మనుస్మృతి 4-21)

బ్రహ్మయజ్ఞం, దేవయజ్ఞం, పితృయజ్ఞం బలివైశ్వ దేవయజ్ఞం, అతిథి యజ్ఞాలనే పంచ మహాయజ్ఞాలను సమస్త మానవులు యథావిధిగా ఆచరించాలని మనుమహర్షి ఉపదేశించారు.

"సా ప్రథమా సంస్కృతి ర్విశ్వవారా" (యజుర్వేదము)

ప్రపంచంలో ప్రజలందరిచే వరింపదగిన ప్రథమ సంస్కృతి - వైదిక సంస్కృతి. ఆ వైదిక సంస్కృతి యొక్క ఒక చిన్న ప్రతి బింబమే ఈ వైదిక నిత్యకర్మ విధి. సచ్చిదానంద స్వరూపుడైన పరమాత్ముని అపార కృపవలన నిర్మితమయినది ఈ వైదిక నిత్యకర్మవిధి. ఋగ్వేదాది చతుర్వేదాలలోని సిద్ధాంతాలలో పరమాత్ముడు మానవ సమాజానికి ఎంతో మహత్తరమైన ఉపదేశాలు చేశాడు. సమస్త ప్రాణుల యెడల భూతదయను - సమభావమును చూపాలని జనులకు బోధించాడు.

**"వేదోఽఖిలో ధర్మమూలం"** - సమస్త ధర్మాలకు మూలము వేదములే.

చతుర్వేదాది మహత్ శాస్త్రాలలో పంచ మహాయజ్ఞాలు వర్ణాశ్రమ ధర్మాలు, చతుర్విధ పురుషార్థాలు, షోడశ సంస్కారాలు మొదలైన సిద్ధాంతపరమైన అంశాలెన్నో వున్నాయి. అవన్నీ వేదశాస్త్రాల అస్తిత్వాన్ని ఋజుత్వాన్ని నిరూపిస్తున్నాయి. **నాస్తివేదాత్ పరంశాస్త్రం** - వేద శాస్త్రాలను మించిన గొప్ప గ్రంథాలు మరొకటి లేవు. వైదిక వాఙ్మయం చాలా విస్తృతమైనది. ఈ వైదిక నిత్య కర్మవిధి గ్రంథంలో వైదిక జీవనం యొక్క పరిచయాన్ని పాఠకులకు తెలియజేయడం జరిగింది. వైదిక యుగంలో ఉపనిషత్తుల కాలంలో వేద ఋషులు మనోజ్ఞమైన మనస్సుతో

యోగదృష్టితో భగవత్ సాక్షాత్కారాన్ని పొంది లోక కళ్యాణం కోసం మానవ సమాజం విధిగా పాటించాల్సిన అంశాలను మనకు శాస్త్రాల ద్వారా బోధించారు. అందులో కొన్ని ఈ గ్రంథంలో వివరించడం జరిగింది. ఈ వైదిక నిత్యకర్మ విధి గ్రంథంలో అయిదు భాగాలున్నాయి. అందులో ప్రథమ భాగంలో పంచ మహాయజ్ఞాలు, ద్వితీయ భాగంలో ఈశ్వర భజనలు, యజుర్వేద స్తుతి ప్రణవ స్తోత్రం, తృతీయభాగంలో పదిహేరు వేద సూక్తాలు - వాటి వ్యాఖ్యానాలు, చతుర్థ భాగంలో పర్వపద్ధతి పంచమ భాగంలో సంస్కార సముచ్ఛయం అనే అంశాలతో ఈ గ్రంథ విభజన జరిగింది.

వేద విద్వాంసుల సాహిత్య సమన్వయంతో పంచ మహాయజ్ఞ విధిని ఇంతకు ముందే పాఠకులకు పరిచయం చేయడం జరిగింది. ఈ వైదిక నిత్యకర్మ విధిలో మరికొన్ని జోడించి ఈ గ్రంథాన్ని విస్తృతం చేస్తున్నాము. ధర్మప్రియులు, ఇతర సత్పురుషులు, సజ్జనులు ముఖ్యంగా ఆర్య మహిళా సమితి సభ్యులు మరీ మరీ కోరిన తరువాత ఈ గ్రంథాన్ని వెలువరించాల్సి వచ్చింది.

పరమేశ్వరానుగ్రహం వలన రెండున్నర దశాబ్దాలకు పూర్వం ఆర్య మహిళా సమితి ఆవిర్భావం జరిగింది. సమితి సభ్యులు వైదిక జీవనాన్ని వరించి అనుసరించి యథావిధిగా వైదిక నిత్యకర్మలైన అగ్నిహోత్రాది శుభకర్మలను ఆచరిస్తున్నారు. కొందరైతే వారి శక్తి సామర్థ్యాలను అనుసరించి వైదిక ధర్మ ప్రచారం చేస్తున్నారు. సర్వజ్ఞుడైన పరమాత్ముని కృపవలన ఆర్యమహిళాసమితి సభ్యులు మా దంపతుల దగ్గర వేదవాఙ్మయము - ఆర్షసాహిత్యము ఋషిప్రణీత గ్రంథాలలోని కొన్ని అంశాలలో శిక్షణ పొందారు. పూజ్యపాదులు శ్రీమత్ గురువర్యులు శ్రీ శాస్త్రిగారి వైదిక సాహిత్యంతో మేము నిర్వహించే ఉపనిషత్ తరగతుల ద్వారా వారి జీవితాలను ధర్మ మార్గం వైపు మలుచుకున్నారు. వారి జీవనయాత్రలో ప్రధానంగా వేద సిద్ధాంతాలకు ప్రాధాన్యత నివ్వడం నేర్చుకున్నారు. వైదిక మర్యాదలననుసరించి గృహవాతావరణాన్ని ప్రశాంతంగా చేసుకున్నారు. సంతానానికి వైదిక సంస్కారాలనందించారు. ఈ విధంగా ఆర్య మహిళా సమితి సభ్యులు సర్వవిధాల సంస్కారవంతులయ్యారు.

వారు ప్రాచీన ఋషి సంస్కృతి సంప్రదాయాలను గౌరవిస్తున్నారు. ఇదంతా మహర్షి భగవాన్ దేవదయానందుల వారి కృపతోనే జరిగింది. వారు ఈ దేశంలో జన్మించి మహిళలనుద్ధరించి మహోపకారం చేశారు. మహిళా లోకం ఆ ఋషి ఋణం తీర్చుకోలేనిది. మహిళా సమితి సభ్యులకు ఆ మహర్షిపట్ల వైదిక సాహిత్యం పట్ల అత్యంత భక్తి శ్రద్ధలేర్పడ్డాయి. వారిలో కలిగిన మార్పు ఈ గ్రంథ రచనకు తోడ్పడింది. వారి ఒత్తిడికి లోనై నేనీ వైదిక గ్రంథరచన చేశాను. వైదిక జీవన స్రవంతిలోకి మరొక జ్ఞాన పుష్పాన్ని తేగలిగాను. వైదిక నిత్యకర్మ విధిని వ్రాయగలిగాను.

వైదిక వాఙ్మయం చాలా విస్తృతమయినది. ఈ వైదిక నిత్యకర్మ విధిలో తృతీయ భాగంలో వేదసూక్తాలు - సంక్షిప్త వ్యాఖ్యానాలు - మంత్రార్థాలను సమగ్రంగా గ్రహించి సంక్షిప్తంగా క్లుప్తంగా వ్యాఖ్యానం చేయడం జరిగింది. దీని ద్వారా ఏయే సూక్తాలు వేద భగవానుని విషయంలో ఏయే అర్థాలను వివరిస్తాయో తెలుస్తుంది. అదే ఇందులోని విశేషత. పదిహేను సంవత్సరాలకు పూర్వం మా ద్వారా వెలువడిన 'పంచమహాయజ్ఞ విధి' అనే గ్రంథంలో ఇన్ని సూక్తాలు వ్యాఖ్యానాలు లేవు. ఇప్పుడు పాఠకుల అభిప్రాయాలననుసరించి లఘు గ్రంథాలను కూడా కలిపి నిత్యకర్మవిధిని తయారు చేశాము. పాఠకుల శ్రద్ధను బట్టి వారు ఆయా సూక్తాల వ్యాఖ్యానాన్ని ఉపదేశరూపంలో శ్రోతలకు వినిపించవచ్చు లేక బోధించవచ్చు. అందరికి అర్థమయ్యే విధంగా సరళంగా సుందరంగా సామాన్య రీతిలో ఆయా వ్యాఖ్యానాలను మలచడం జరిగింది. అందువలన వేదవేద్యుని స్వరూప స్వభావాలు క్రొత్తవారికి సుబోధకం కాగలవు. మహర్షి భగవాన్ దయానంద సరస్వతుల వారి వేద భాష్యాన్ని ప్రామాణికంగా ఆధారం చేసుకొని ఈ ప్రయత్నం చేశాను.

వేదస్తుతి, ప్రణవ స్తోత్రాలను ఈ గ్రంథంలోనే కలపాలని సమితి సభ్యులు ఆశించారు. అనంతరం పర్వపద్ధతిని చేర్చడం జరిగింది. సంస్కార సముచ్ఛయాన్ని అనుక్రమణలో భాగంగా మార్పుచేసి పంచమభాగంగా తీర్చిదిద్దాము.

సంధ్యావందనం సంస్కార సందేశం ద్వారా ఇప్పటి వరకు వెలువడిన గ్రంథాలలో 1) వేదవాఙ్మయం 2) అంతర్యామి 3) మర్యాదా పురుషోత్తముడు శ్రీరామచంద్రుడు 4) యుగపురుషుడు శ్రీకృష్ణ భగవానుడు 5) ఆదిశాసనకర్త మహర్షి మనువు 6) చతుర్వేద సూక్తములు 7) యజుర్వేద స్తుతి – ప్రణవ స్తోత్రం ఇప్పుడు 8వ జ్ఞానపుష్పంగా ఈ వైదిక నిత్యకర్మ విధిని వెలువరిస్తున్నాము.

లోకపూజ్యుడైన ఆ దేవదేవుని కృపవలన ఈ గ్రంథాలన్నీ జిజ్ఞాసువులైన పాఠకుల కోరికపై అనేకసార్లు ముద్రించడం జరిగింది. అందుకు దాతలు కూడా బహువిధాలుగా సహకరించారు. అట్లాగే ఈ గ్రంథాన్ని ముద్రించడానికి ద్రవ్యదాతలుగా ఆర్యమహిళా సమితి సభ్యులు అందరూ ముందుకొచ్చారు. సర్వవిధాలుగా సహకరించారు. వారిలో కలిగిన మహత్తర మార్పుకు ఆశయానికి మా దంపతులం వారికి హృదయపూర్వక ధన్యవాదాలు తెలియచేస్తున్నాము. వారిపట్ల మా ఆనందాన్ని హర్షాన్ని వ్యక్తం చేస్తున్నాము.

సంధ్యావందనం సంస్కార సందేశం ద్వారా వెలువడిన గ్రంథాలను పాఠకులు ఇంతకు ముందు ఆదరించి ఆచరించినట్లే ఈ వైదిక నిత్యకర్మ విధి గ్రంథాన్ని కూడా మనస్ఫూర్తిగా ఆదరించి అనుసరించి భవిష్యత్తులో మరికొన్ని వైదిక సుగంధ పుష్పపరిమళాలను ఆస్వాదించాలని ఆశిస్తూ –

"వేదోదితం స్వకం కర్మా నిత్యం కుర్యాదతంద్రితః"

వేద విహిత ధర్మ కర్మలు సకల జనులు సర్వకాల సర్వావస్థలయందు ఆచరించాలనే మహర్షుల ప్రబోధాన్ని పాలించాలని కోరుతూ --

ధన్యవాదములతో

శ్రీమతి డా॥ సంధ్యావందనం లక్ష్మీదేవి



# మనః పూర్వక కృతజ్ఞతలు

భగవదనుగ్రముతో తయారైన 'వైదిక నిత్యకర్మవిధి' అనే ఈ గ్రంథము పురాతన వైదిక సంస్కృతికి సంబంధించినది. ఇది మానవుని ఆధ్యాత్మిక జీవనయాత్రలోని ప్రత్యేకమైన నియమావళికి చెందినది. ఈ లఘు గ్రంథము పాఠకులకు బహుముఖాలుగా ఉపయోగపడుతుంది. ఆస్తికులకు వైదికులకు విశేషమైన ప్రయోజనాన్ని సిద్ధింపచేస్తుంది. ముఖ్యంగా వేదప్రియులకు భగవద్భక్తులకు ఈశ్వరారాధకులకు ఇది ఎంతగానో దోహదపడుతుంది. వారి అంతరాత్మకు మనస్సుకు సంతృప్తిని, ఆనందాన్ని, ఆహ్లాదాన్ని కలిగిస్తుంది.

ఈనాడు పుంఖాను పుంఖాలుగా వెలువడుతున్న అనేక విధములైన సాహిత్యము పుస్తకములు మానవజాతిన ఆందోళనకు గురిచేస్తున్నాయి. కొన్ని ఆలోచింపచేసి సన్మార్గంలో నడిపిస్తున్నాయి. మరికొన్ని తప్పుదారి పట్టిస్తున్నాయి. ఇటువంటి సమయంలో ఈ గ్రంథాల ప్రయోజనం ఎంతగానో వుంటుంది. ఇవి ఏ తరం వారికైనా ఆదరణీయమయినవి అవసరమయినవి. అన్ని కాలాలలో అందరికి ఉపయోగపడే గ్రంథాలు కొన్నే వుంటాయి. ఇది ఆ కోవలోకే వస్తుంది. కనుక సర్వవిధాల సర్వులకు అనుసరణీయమని నేను భావిస్తున్నాను.

ఈ గ్రంథ రచనకు ప్రత్యక్షంగా పరోక్షంగా సహకరించిన నా పతిదేవులు, గురుతుల్యులు శ్రీమాన్ సంధ్యావందనం శ్రీనివాసరావుగారికి శ్రద్ధతో ప్రణామాలర్పించి కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను.

ముఖ్యంగా అత్యంత ఉత్సాహంగా ముందుకు సాగుతూ ఆర్థికంగా తోడ్పాటు నందించిన ఆర్య మహిళా సమితి సభ్యులకు మా దంపతులం హృదయపూర్వక ధన్యవాదములు తెలియచేస్తున్నాము. వారికి పరాత్పరుడైన పరమాత్ముడు ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించాలని, వారు నిరంతరం ఆధ్యాత్మిక వేదమార్గంలో పయనించాలని, సర్వదా త్రికాలజ్ఞుడు లోక పూజ్యుడైన వేదవేద్యునే ఉపాసించాలని,

సదా ఆ దేవదేవుని కృపకు వారు పాత్రులు కావాలని మా దంపతులం పరమాత్ముని కోరుచున్నాము.

ఈ గ్రంథం యొక్క అట్ట వెనుక భాగంలో వేసిన దేవతార్చనా మందిరము - యజ్ఞశాల ఛాయా చిత్రాన్ని కోరినంతనే స్వీకృతిని ప్రసాదించిన ఆర్షశోధ సంస్థాన్ ఆచార్యులు సుప్రసిద్ధులు వేదాచార్యులు దర్శనాచార్యులు శ్రీ ఆనంద ప్రకాశ్ గారి చరణాలకు భక్తితో నమస్కృతులు అందచేస్తున్నాను.

ఈ గ్రంథ ముద్రణలో అమూల్యమైన సలహా సహకారాలనందించిన షామీర్ పేట మండలం అలియాబాద్ ఆర్షశోధ సంస్థాన్ కన్యాగురుకుల ఆచార్యిణి సుశ్రీవిదుషీ శ్రీమతి నీరజా శ్రీ భవభూతి దంపతులకు శ్రద్ధతో కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను.

అక్షరాలను అత్యంత సుందరంగా మనోజ్ఞంగా తీర్చిదిద్ది తెలుగుభాష సౌందర్యాన్ని నైపుణ్యాన్ని ప్రస్ఫుటంగా ప్రదర్శించిన ధర్మసోదరి శ్రీమతి దామరాజు నాగలక్ష్మిగారి కృషిని శ్లాఘిస్తూ ఆత్మీయంగా ప్రశంసిస్తూ ఆమెకు ధన్యవాదాలు తెలియచేస్తున్నాను.

చివరగా ఈ గ్రంథాన్ని అత్యంత రమణీయంగా తయారుచేసి అందించిన కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, విద్యానగర్, హైదరాబాద్ వారికి శ్రద్ధతో కృతజ్ఞతలు తెలియచేస్తున్నాము.

ఈ గ్రంథం ఇంత సర్వాంగసుందరంగా చూపరులను ఇట్టే ఆకర్షించే విధంగా తయారు కావడానికి సహకరించిన సర్వులకు హృదయపూర్వక నమస్కృతులు తెలియచేస్తూ...

'సర్వేజనాః సుఖినో భవంతు'

ధన్యవాదములతో, కృతజ్ఞతలతో

'శ్రీమతి డా॥ సంధ్యావందనం లక్ష్మీదేవి'
శ్రీ రథసప్తమి, గణతంత్ర దివసం
తేది 26-1-2015, సోమవారం





# విషయ సూచిక

## ప్రథమ భాగము

## ద్వితీయ భాగము



## తృతీయ భాగము

**20. చతుర్వేదములలోని ప్రసిద్ధ వేద సూక్తములు - వ్యాఖ్యానములు**

# చతుర్థ భాగము

## 21. వైదిక పర్వములు - విధులు



# పంచమ భాగము

## 22. సంస్కార సముచ్చయము



# ప్రథమ భాగము



# వైదిక నిత్యకర్మ విధి

## ప్రాతః స్మరణ మంత్రములు
## సంక్షిప్త వ్యాఖ్యానము

మంగళ ప్రభాత వేళ అమృత స్వరూపుడైన పరమేశ్వరుని తేజోమయ ప్రకాశ శక్తిని మేము కోరుచున్నాము. ప్రాతఃకాలమున భజింప యోగ్యమైన ఆ పరాత్పరుని మహిమలను సర్వత్ర దర్శించుచున్నాము. ఆ పరంధాముని సౌమ్యభావమును మాకు ప్రసాదించమని ప్రార్థించుచున్నాము.

వేద భగవానుడు సమస్తలోకాలకు ఆరాధ్యుడు. మాననీయుడు. మేము ఆ జగత్పాలకుని సేవించి తరింతుము. ఆ పూర్ణ పురుషుని భక్తి భావముతో సేవింతుము. ఐశ్వర్య ప్రదాతవైన హే దేవా! మాకు సమస్త ఐశ్వర్యములను పశుసంపదను ప్రసాదింపుము. విద్వాంసుల శోభన బుద్ధి మమ్ములను పవిత్రులను చేయుగాక! హే భగవాన్! మోక్షప్రదాతవైన నిన్ను విశ్వమంతయు పూజించుచున్నది.

పరమాత్ముడు సర్వదివ్యగుణకర్మ స్వభావ విద్యా యుక్తుడు. పృథివి సూర్యాది లోకాలు భగవంతునిలోనే ఉన్నాయి. ఆ సర్వేశ్వరుడే సర్వదేవతలకు దేవుడు. ఆ పరమేశ్వరుడు ఎన్నడూ నశించడు. ఆ జగదీశ్వరుడే అన్నింటిలో వ్యాపించి ఉన్నాడు. ఆ సర్వసాక్షి అందరికంటే శ్రేష్ఠుడు. - ఋగ్వేదము

## అథ ప్రాతః స్మరణ మంత్రాః

ఓం ప్రాత రగ్నిం ప్రాత రింద్రం హవామహే, ప్రాతర్మిత్రా వరుణాప్రాత రశ్వినా,
ప్రాతర్భగం పూషణం బ్రహ్మణస్పతిం, ప్రాత: సోమముత రుద్రం హువేమ॥

ఓం ప్రాతర్జితం భగ ముగ్రం హువేమ, వయం పుత్ర మదితేర్ యోవిధర్తా।
ఆధ్రశ్చిద్యం మన్యమాన స్తురశ్చిద్, రాజాచిద్యం భగం భక్షీత్యాహ॥

ఓం భగ ప్రణేతర్ భగ సత్యరాధో భగేమాం ధియ ముద వాదదన్నః।
భగప్రణో జనయ గోభి రశ్వైర్ భగ ప్రనృభిర్ నృవంత: స్యామ॥

ఓం ఉతేదానీం భగవంత: స్యామ ఉత ప్రపిత్వ ఉత మధ్యే అహ్నామ్।
ఉతోదితా మఘన్త్సూర్యస్య వయం దేవానాం సుమతౌస్యామ॥

ఓం భగ ఏవ భగవా నస్తు దేవా స్తేన వయం భగవంత: స్యామ।
తం త్వా భగ సర్వ ఇజ్జోహవీతి స నో భగ పుర ఏతా భవేహ॥

(ఋగ్వేదం 7-41-1,2,3,4,5)

## స్నాన మంత్రములు

ఓం అపోహిష్ఠా మయోభువ స్తాన ఊర్జే దధాతన । మహే రణాయ చక్షసే॥
ఓం యో వః శివతమో రస స్తస్య భాజయతేహ నః । ఉశతీ రివ మాతరః॥
ఓం తస్మా అరంగమామ వో యస్యక్షయాయ జిన్వథ। ఆపో జనయథా చ నః॥

(ఋగ్వేదం 10-9-1,2,3)

## యజ్ఞోపవీత ధారణ మంత్రము

ఓం యజ్ఞోపవీతం పరమం పవిత్రమ్
ప్రజాపతే ర్య త్సహజం పురస్తాత్।
ఆయుష్య మగ్ర్యంప్రతిముంచ శుభ్రం
యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥

ఓం యజ్ఞోపవీత మసి యజ్ఞస్య త్వా
యజ్ఞోపవీతేన ఉపనహ్యామి।



## సంధ్యోపాసన మంత్రముల సంక్షిప్త పరిచయం

సంధ్యోపాసన ద్వారా మానవుడు పరమ పురుషార్థమగు మోక్షమును కాంక్షించును. కనుక అట్టి మోక్షప్రాప్తి కొరకు మానవులాచరింపవలసిన కర్తవ్య కర్మలు మూడు. ఒకటి - తన యెడ ఆచరింపవలసిన కర్మలు, రెండు - ఇతరుల ఎడల ఆచరింపవలసిన కర్మలు. మూడవది - పరమేశ్వరుని సాక్షాత్కారము కొఱకు ఆచరించు కర్మలు. ఈ మూడింటితో ఉపాసకుడు సాధింపగోరు కైవల్యమును ఆచమన మంత్రముతో సంకల్పించును. మొదట తన కొరకు ఆచరించు కర్మలలో ఇంద్రియ స్పర్శ మంత్రములు, మార్జన మంత్రములతో, బాహ్య ఇంద్రియముల బలము కొఱకు, యశస్సు కొఱకు, పవిత్రత కొరకు సంకల్పించును. ప్రాణాయామ మంత్రములతో అంతఃకరణ పుష్టికి పవిత్రతల కొరకుసంకల్పించును. అఘమర్షణ మంత్రములతో సర్వవ్యాపకుడైన పరమేశ్వరుని ఈ సృష్టికంతకూ కర్తగనెంచి పాపములకు దూరముగ నుండుటకు సంకల్పించును. ఈ ఐదు కర్మలను ఉపాసకుడు తన కొఱకు చేయవలయును.

తరువాత మనసాపరిక్రమ మంత్రములతో హే భగవన్ మాపై యితరులకు, ఇతరులపై మాకును వైరభావం లేకుండా అనుగ్రహింపుమని భగవంతుని ప్రార్థించుచు తదనుగుణముగ తోటి ప్రాణుల ఎడల మెలగ వలయును.

తరువాత ఉపస్థాన మంత్రములతో ఉపాసకుడు పరమేశ్వరుని కత్యంత సమీపమున చేరి పరమేశ్వరునిలోని ఆనందము ననుభవించుట కొరకు సంకల్పించుచు, తత్సిద్ధికై అష్టాంగ యోగాదులను అభ్యసింప వలయును.



## అథ బ్రహ్మయజ్ఞః - సంధ్యోపాసన మంత్రాః

ఓం భూర్ భువః స్వః ।
తత్ సవితుర్ వరేణ్యమ్,
భర్గో దేవస్య ధీమహి ।
ధియో యో నః ప్రచోదయాత్ ॥

### ఆచమన మంత్రము

ఓం శం నో దేవీ రభిష్టయ, ఆపో భవంతు పీతయే ।
శం యో రభిస్రవంతు నః ॥

### ఇంద్రియ స్పర్శ మంత్రములు

ఓం వాక్ వాక్, ఓం ప్రాణః ప్రాణః, ఓం చక్షుః చక్షుః, ఓం శ్రోత్రం శ్రోత్రమ్,
ఓం నాభిః, ఓం హృదయమ్, ఓం కంఠః, ఓం శిరః
ఓం బాహుభ్యాం యశోబలమ్ ఓం కరతల కరపృష్ఠే,

### (ఈశ్వర ప్రార్థనాపూర్వక) మార్జన మంత్రములు

ఓం భూః పునాతు శిరసి, ఓం భువః పునాతు నేత్రయోః
ఓం స్వః పునాతు కంఠే, ఓం మహః పునాతు హృదయే
ఓం జనః పునాతు నాభ్యామ్, ఓం తపః పునాతు పాదయోః
ఓం సత్యం పునాతు పునఃశిరసి, ఓం ఖం బ్రహ్మ పునాతు సర్వత్ర

### ప్రాణాయామ మంత్రములు

ఓం భూః, ఓం భువః, ఓం స్వః, ఓం మహః, ఓం జనః, ఓం తపః,
ఓం సత్యమ్.

## అఘమర్షణ మంత్రములు

ఓం ఋతం చ సత్య చాభీద్ధా త్తపసో2ధ్యజాయత,
తతోరాత్ర్యజాయత, తతఃసముద్రో2ర్ణవః

ఓం సముద్రా దర్ణవా దధి సంవత్సరో అజాయత
అహెూ రాత్రాణి విదధ ద్విశ్వస్య మిషతో వశీ.

ఓం సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్, దివంచ పృథివీం
చాంతరిక్ష మథోస్వః (ఋ. 10-170-1,2,3)

ఓం శన్నోదేవీ రభిష్టయ ఆపోభవన్తు పీతయే ।
శంయో రభిస్రవన్తు నః ॥ (యజు. 36-12)

## మనసా పరిక్రమ మంత్రములు

ఓం ప్రాచీ దిగగ్నిరధిపతిరసితో రక్షితాదిత్యా ఇషవః
తేభ్యో నమో2ధిపతిభ్యో నమో రక్షితృభ్యోనమ।
ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యో2స్మాన్ ద్వేష్టి,
యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః॥

ఓం దక్షిణా దిగింద్రో2ధిపతిస్తిరశ్చిరాజీ రక్షితా, పితర ఇషవః,
తేభ్యో నమో2ధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ।
ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యో2స్మాన్ ద్వేష్టి
యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః॥

ఓం ప్రతీచీ ద్విగ్వరుణో2ధిపతిః పృదాకూ రక్షితాన్న మిషవః
తేభ్యో నమో2ధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ।
ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యో 2స్మాన్ ద్వేష్టి
యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః॥

ఓం ఉదీచీ దిక్ సోమో2ధిపతిః స్వజో రక్షితాశని రిషవః
తేభ్యో నమో2ధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ।
ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యో 2స్మాన్ ద్వేష్టి
యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః॥

ఓం ధ్రువాదిగ్విష్ణురధిపతిః కల్మాషగ్రీవో రక్షితా వీరుధ ఇషవః
తేభ్యో నమో2ధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ।
ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యో 2స్మాన్ ద్వేష్టి
యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః॥

ఓం ఊర్ధ్వాదిగ్ బృహస్పతి రధిపతిః శ్విత్రో రక్షితా వర్షమిషవః
తేభ్యో నమో2ధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ।
ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యో 2స్మాన్ ద్వేష్టి
యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః॥

(అథర్వ. 3-27-1,2,3,4,5,6)

## ఉపస్థాన మంత్రములు

ఓం ఉద్వయం తమసస్పరి స్వః పశ్యన్త ఉత్తరమ్।
దేవం దేవత్రా సూర్య మగన్మజ్యోతి రుత్తమమ్॥ (యజు. 35-14)

ఓం ఉదుత్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః।
దృశే విశ్వాయ సూర్యమ్॥ (యజు. 33-31)

ఓం చిత్రం దేవానాముదగా దనీకం
చక్షుర్మిత్రస్య వరుణ స్యాగ్నేః।
ఆప్రాద్యావా పృథివీ అంతరిక్షగ్ం,
సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ స్వాహా॥

ఓం తచ్చక్షుర్దేవహితం పురస్తా చ్ఛుక్ర ముచ్చరత్
పశ్యేమ శరదః శతమ్, జీవేమ శరదః శతగ్ం।
శృణుయామ శరదః శతం, ప్రబ్రవామ శరదః శతం
అదీనాస్స్యామ శరదః శతం, భూయశ్చ శరదః శతాత్॥

## గురుమంత్రము - గాయత్రీ

ఈ మంత్రం మూడుసార్లు జపించాలి.

ఓం భూర్భువః స్వః, త త్సవితుర్వరేణ్యమ్।
భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్॥

(యజు. 36-3, ఋ. 3-62-10, సా. 900)

హే రక్షకా! సచ్చిదానంద స్వరూపా, నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావా, అజ నిరంజన నిరాకార సర్వ వ్యాపకా సర్వాంతర్యామిన్ జగదుత్పాదకదేవా! నీ దివ్యము వరేణ్యమునైన సచ్చిదానంద స్వరూపమును మేము సర్వదా మా హృదయమున ధ్యానింతుము. మాకు సద్బుద్ధినిచ్చి సద్వ్రతములను ఆచరించునట్లు మమ్ము అనుగ్రహింతువు గాక!

## సమర్పణ

హే జగదీశ్వర! దయానిధే! భవత్ కృపయా, అనేన జపోపాసనాది కర్మణా, ధర్మార్థ కామమోక్షాణాం సద్యః సిద్ధిః భవే న్నః

హే జగదీశ్వర! దయాళు, నీ కృపవలన మేము చేసిన ఈ జప ఉపాసనాది కర్మముల ద్వారమున ధర్మార్థ కామ మోక్షములు వెంటనే సిద్ధించును గాక!

## నమస్కార మంత్రము

ఓం నమః శంభవాయ చ, మయోభవాయ చ, నమః శంకరాయ చ, మయస్కరాయ చ, నమః శివాయ చ, శివతరాయ చ॥ (యజు. 16-41)

ఓం శాంతిః శాంతిః శాంతిః

(సంధ్యోపాసన విధి సమాప్తము)



## ఈశ్వర స్తుతి - ప్రార్థన - ఉపాసన మంత్రములు

### సంక్షిప్త వ్యాఖ్యానము

సర్వ శుభంకరుడవైన హే పరమాత్మా! మాలోని సమస్త పాపములను, దుఃఖములను దూరము చేసి ఏది కల్యాణ ప్రదమో దానినే మాకు ప్రసాదించుము. సమస్త ప్రాణి జాతమునకు దేహాదులను ప్రసాదించువాడు పరమాత్ముడే. సమస్త జగత్తునకు గతి గమ్యము అతడే. సమస్త దేవగణములు ఆ సర్వేశ్వరుని ఆజ్ఞలనే పాలించుచున్నవి. ఆయన ఆశ్రయమే మోక్షదాయకము. ఆ దేవదేవుని అనాశ్రయమే మరణదాయకము. ఆయన పృథివ్యాది లోకములను పాలించువాడు. అతడే బంధువు, జనకుడు, విధాత. వేదవేద్యుడైన ఆ పరమపూజ్యునకు భక్తితో నమస్కరించుచున్నాము.

పరమేశ్వరుని స్తుతించుటవలన ఆయనపై భక్తి శ్రద్ధలేర్పడును. తద్వారా ఆయనలోని గుణములను స్మరించి మనము వాటిని అనుసరించుటకు వీలగును. ప్రార్థన వలన అభిమానము నశించి పరమాత్ముని సహాయము లభించును. ఉత్సాహము పెరిగి పురుషార్థపరుల మగుదుము. ఉపాసన వలన భగవంతుని సాక్షాత్కారము లభించి ఆయనతో మేళనము కలిగి ఆ జగదీశ్వరునిలోని ఆనందమును అనుభవింతుము.

### అథ ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనా మంత్రాః

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ।
యద్ భద్రం తన్న ఆసువ॥

ఓం హిరణ్య గర్భః సమవర్త తాగ్రే,
భూతస్య జాతః పతి రేక ఆసీత్।
సదాధార పృథివీం ద్యా ముతేమాం
కస్మైదేవాయ హవిషా విధేమ॥

ఓం యఆత్మదా బలదా, యస్య
విశ్వ ఉపాసతే, ప్రశిషం యస్య దేవాః।
యస్య చ్ఛాయామృతం యస్య మృత్యుః
కస్మై దేవాయ హవిషా విధేమ॥

ఓం యః ప్రాణతో నిమిషతో మహిత్వైక,
ఇద్రాజా జగతో బభూవ।
య ఈశే అస్య ద్విపద శ్చతుష్పదః
కస్మై దేవాయ హవిషా విధేమ॥

ఓం యేన ద్యౌరుగ్రా పృథివీచ దృఢా,
యేన స్వః స్తభితం యేన నాకః।
యో అంతరిక్షే రజసో విమానః
కస్మై దేవాయ హవిషా విధేమ॥

ఓం ప్రజాపతే నత్వ దేతా న్యన్యో,
విశ్వాజాతాని పరితా బభూవ।
యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు
వయం స్యామ పతయోరయీణామ్॥

ఓం సనో బంధుర్జనితా స విధాతా
ధామాని వేద భువనాని విశ్వా।
యత్ర దేవా అమృత మానశానా
స్తృతీయే ధామన్నధ్యైరయన్త॥

ఓం అగ్నే నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్।
యుయోధ్యస్మ జ్జుహురాణమేనో
భూయిష్ఠాంతే నమ ఉక్తింవిధేమ॥

(ఇతి ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనా మంత్రాః)



## స్వస్తి వచన మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము

వేదవేద్యుడైన పరమాత్ముడు ప్రాణికోటి శ్రేయస్సును కాంక్షించి సృష్టి స్థితి లయ రూప యజ్ఞమును చేయుచున్నాడు. మానవులందరికీ తల్లి తండ్రి గురువు దైవము ఆ పరమ పురుషుడే.

వేదోపదేశకులు మానవజాతిని సన్మార్గమున నడిపించుగాక! వేదమాత మాకు దివ్య శక్తులను ప్రసాదించి సుఖసాధనముగుగాక! శాంతిప్రదాత పరమాత్ముడు మమ్ములను సర్వదా రక్షించుగాక! దుష్టులను దండించు న్యాయకారియగు రుద్రస్వరూపుడైన పరమేశ్వరుడు సజ్జనులను సర్వదా రక్షించుగాక! మాలోని దశప్రాణములు సుదృఢములై మాకు హాని కలిగింపకుండుగాక! హే భగవన్! సత్కర్మలను ఆచరించుటకు మాకు ధనధాన్యములను సమృద్ధిగా ప్రసాదింతువుగాక! సూర్యచంద్రులవలె మేము ఉన్నత మార్గమును అనుసరింతుము గాక! ఏ ప్రాణిని హింసింప కుండుముగాక! మేము సర్వదా సజ్జనుల సాంగత్యము చేయుదుము గాక! యజ్ఞాది సత్కర్మలను చేయు వేద విదులైన విద్వాంసులు మాకు యశస్సును, శుభమును ప్రసాదింతురుగాక! హే ప్రభూ! నీ వేదాజ్ఞలను పాలించువారిని సర్వదా నీవే రక్షింతువు. జ్ఞానధనులు మానవ సమాజమునకు మార్గదర్శకులగుదురు గాక! సద్బుద్ధి కొరకు సర్వేశ్వరుని సదా స్మరింతుముగాక! త్యాగధనులైన ఆదిత్య బ్రహ్మచారులను సప్రేమభావముతో ఉత్తమ వాక్యములతో ప్రశంసించెదముగాక!

హే దేవా! మంగళప్రదమైన వేదవాణితో మేము నిన్ను నిత్యము ఉపాసింతుము. జ్ఞానకర్మ ఉపాసనారూప యజ్ఞమును బోధించు వాడవు నీవే. దేహమనే ఈ రథమును సప్తహోతలతో - ముఖాది అంగములతో నిర్మలమైన మనస్సుతో భగవంతుడు నిర్మించెను.

హే పరమాత్మా! త్రికరణములతో - మనోవాక్కాయకర్మలతో సర్వ విధముల శుభాచరణమును చేయుదుము. కష్టములలో పరంధాముని సహాయమునర్థింతుము. సద్బుద్ధికై పరమేశ్వరునినాశ్రయింతుము. మోక్షధాముని పొందుటకు ముక్తి మార్గమునన్వేషింతుము. భగవత్ ప్రాప్తికై ఈ శరీరము సుగమమైన నావవంటిది. నిరంతరము సత్యవచనములతోను ప్రశంసాస్తుతులతోనూ పరమాత్ముని సేవింతుము.

మేము నిరంతరము ఇతరులతో సద్భావముతో వ్యవహరించెదము గాక! మేము ఎవరిని ద్వేషింపకుందుముగాక! మమ్ములనెవ్వరు ద్వేషింపకుందురుగాక! మనుష్యుడు ధర్మాచరణతోనే భగవద్భక్తుడు కాగలడు. ఉత్తమ సంతానము నిర్మింపగలడు. ఇతరులకు మార్గదర్శనము చేయగలడు. మనుష్యుడు శరీరమనే ఈ రథముతోనే నిష్కామకర్మలను ఆచరించి కైవల్యమును పొందగలడు. వాసయోగ్యమగు వసుంధరా పృథివి సిరిసంపదలతో నిండియుండి మమ్ములను సుఖింపచేయుగాక! శుభకర్మలు చేయుటకై భగవంతుడు మమ్ములను నిత్యము ప్రేరేపించుగాక!

పాపరహితులు ధర్మాత్ములు సత్యవాదులైన ప్రభువులు మమ్ములను పాలింతురుగాక! విద్వాంసుల సాంగత్యముతో మేము సహృదయులము అగుదుముగాక! శుభసంకల్పముతో జీవింతుము గాక! జగత్పాలకుడు పోషకుడు రక్షకుడగు ఆ దేవదేవుని - స్తుతించెదముగాక! సర్వజ్ఞుడగు ఆ సర్వేశ్వరుడు సంసారసాగరము నుండి మమ్ములను తరింపచేయుగాక! లోక పూజ్యుడైన పరమాత్మునికి ప్రీతికరమైన వేద విహిత శుభకర్మలను ఆచరించెదము గాక! సమాహిత - ఏకాగ్రమైన మనస్సుతో సర్వద్రష్టను స్తుతించెదముగాక! పరాత్పరుడు మాకు ముక్తి ఫలమును ప్రసాదించుగాక!

## అథ స్వస్తివాచన మంత్రాః

ఓం అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం। హోతారం రత్నధాతమమ్॥

ఓం స నః పితేవ సూనవే2గ్నే సూపాయనో భవ। సచ స్వానః స్వస్తయే॥

ఓం స్వస్తినో మిమీతా మశ్వినా భగః స్వస్తి దేవ్యదితి రనర్వణః।
స్వస్తి పూషా అసురో దధాతు నః స్వస్తిద్యావా పృథివీ సుచేతునా॥

ఓం స్వస్తయే వాయు ముపబ్రవామహై సోమంస్వస్తి భువనస్య యస్పతిః।
బృహస్పతిం సర్వగణం స్వస్తయే స్వస్తయ ఆదిత్యాసో భవన్తు నః॥

ఓం విశ్వే దేవా నో అద్యా స్వస్తయే, వైశ్వానరో వసురగ్నిః స్వస్తయే।
దేవా అవన్త్వృ భవః స్వస్తయే స్వస్తి నో రుద్రః పాత్వంహసః॥

ఓం స్వస్తి మిత్రా వరుణా స్వస్తి పథ్యే రేవతి।
స్వస్తి న ఇన్ద్రశ్చాగ్ని శ్చ స్వస్తినో అదితే కృధి॥

ఓం స్వస్తి పన్థా మనుచరేమ సూర్యాచంద్రమసా వివ।
పునర్దదతా2ఘ్నతా జానతా సంగమేమహి॥

ఓం యే దేవానాం యజ్ఞియా యజ్ఞియానాం మనోర్యజత్రా అమృతా ఋతజ్ఞాః।
తే నో రాసన్తా మురుగాయ మద్య యూయం పాత స్వస్తిభిః సదా నః॥

ఓం యేభ్యో మాతా మధుమత్పిన్వతే పయః పీయూషం ద్యౌ రదితి రద్రి బర్హాః।
ఉక్థశుష్మాన్ వృషభ రాన్త్స్వప్నసస్తాం ఆదిత్యాం అనుమదా స్వస్తయే॥

ఓం నృచక్షసో అనిమిషన్తో అర్హణా బృహద్దేవాసో అమృతత్వ మానశుః।
జ్యోతీరథా అహిమాయా అనాగసో దివో వర్ష్మాణం వసతే స్వస్తయే॥

ఓం సమ్రాజో యే సువృధో యజ్ఞమాయయు రపరి హ్వృతాదధిరే దివి క్షయమ్।
తాం ఆవివాస నమసా సువృక్తిభి ర్మహో ఆదిత్యాం అదితిం స్వస్తయే॥

ఓం య ఈశిరే భువనస్య ప్రచేతసో విశ్వస్య స్థాతుర్జగతశ్చ మన్తవః।
తే నః కృతాదకృతాదేన సస్పర్యద్యా దేవాసః పిపృతా స్వస్తయే॥

ఓం భద్రే ష్వింద్రం సుహవం హవామహే, అంహోముచం సుకృతం దైవ్యం జనమ్। అగ్నిం మిత్రం వరుణం సాతయే భగం, ద్యావా పృథివీ మరుతః స్వస్తయే॥

ఓం సుత్రామాణం పృథివీం ద్యామనేహసమ్, సుశర్మాణ మదితిం సుప్రణీతిమ్। దైవీం నావం స్వరిత్రామనాగస మస్రవంతీ మా రుహేమా స్వస్తయే॥

ఓం విశ్వే యజత్రా అధివోచ తోతయే త్రాయధ్వం నో దురేవాయా అభిహ్రుతః। సత్యయా వో దేవ హూత్యా హువేమ, శృణ్వతో దేవా అవసే స్వస్తయే॥

ఓం అపామీవామప విశ్వామనాహుతి మపారాతిం దుర్విదత్రా మఘాయతః। ఆరే దేవా ద్వేషో2స్మద్యుయోతనోరుణః శర్మయచ్ఛతా స్వస్తయే॥

ఓం అరిష్టః సమర్తో విశ్వ ఏధతే ప్ర ప్రజాభిర్జాయతే ధర్మణ స్పరి। య మాదిత్యాసో నయథా సునీతిభి రతి విశ్వాని దురితా స్వస్తయే॥

ఓం యం దేవాసో2వథ వాజసాతౌ యం శూరసాతా మరుతో హితే ధనే। ప్రాతర్యావాణం రథమింద్ర సానసి మరిష్యన్త మా రుహేమా స్వస్తయే॥

ఓం స్వస్తినః పథ్యాసు ధన్వసు స్వస్త్యప్సు వృజనే స్వర్వతి। స్వస్తి నః పుత్రకృథేషు యోనిషు స్వస్తిరాయే మరుతో దధాతన॥

ఓం స్వస్తి రిద్ధి ప్రపథే శ్రేష్ఠా రేక్ణ స్వత్యభి యా వామ మేతి। సానో అమాసో అరణే నిపాతు స్వావేశా భవతు దేవగోపా॥

ఓం ఇషే త్వోర్జేత్వా వాయవ స్థ దేవో వః సవితా ప్రార్పయతు శ్రేష్ఠ తమాయ కర్మణ, ఆప్యాయధ్వమఘ్న్యా ఇంద్రాయ భాగమ్। ప్రజావతీ రనమీవా అయక్ష్మా మావస్తేన ఈశత, మాఘశగ్ంసో ధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత బహ్వీ ర్యజమానస్య పశూన్ పాహి॥

ఓం ఆనో భద్రాః క్రతవో యంతు విశ్వతో2దబ్ధాసో అపరీతాస ఉద్భిదః।
దేవా నో యథా సదమిద్వృధే అసన్న ప్రాయువో రక్షితారో దివే దివే॥

ఓం దేవానాం భద్రా సుమతి ర్బుజూయతాం దేవానాగ్ం రాతిరభి నో నివర్తతామ్। దేవానాం సఖ్యముపసేదిమా వయమ్ దేవా న ఆయుః ప్రతిరంతు జీవసే॥

ఓం తమీశానం జగతస్తస్థుషస్పతిం ధియం జిన్వమవసే హూమహే వయమ్। పూషా నో యథా వేదసామసద్వృధే రక్షితా పాయురదబ్ధః స్వస్తయే॥

ఓం స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వ వేదాః।
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్ట నేమిః స్వస్తినో బృహస్పతి ర్దధాతు॥

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః।
స్థిరై రంగై స్తుష్టువాగ్ం స స్తనూభి ర్వ్యశేమహి దేవ హితం యుదాయుః॥

ఓం అగ్న ఆ యాహి వీతయే గృణానో హవ్యదాత యే।
నిహోతా సత్సి బర్హిషి॥ (సామవేద గానం)

ఓం త్వమగ్నే యజ్ఞానాం హోతా విశ్వేషాం హితః। దేవేభి ర్మాను షే జనే॥
(సామవేదగానం)

ఓం యే త్రిషప్తాః పరియంతి విశ్వారూపాణి బిభ్రతః।
వాచస్పతి ర్బలాతేషాం తన్వో అద్య దధాతు మే॥

(ఇతి స్వస్తి వాచన మంత్రాః)



## శాంతి వచన మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము

హే శాంతి స్వరూప పరమేశ్వరా! అగ్ని, జలము, సోమలతాది వనస్పతులు - ఓషధులు మాకు ఆరోగ్యమును, శుభమును, శాంతిని ప్రసాదించుగాక! నిర్మలమగు అంతరిక్షము పృథివీ ద్యులోకములు మాకు శాంతినిచ్చుగాక! మేఘములు వర్షించి మాకు ఔషధీజలమును ప్రసాదించుగాక! పుణ్యవంతులుచేయు సత్కర్మలు మాకు శాంతిని చేకూర్చునుగాక! హేభగవన్! మమ్ములను మాగోవులను పశువులను రక్షించెదవుగాక!

తేజోమయుడైన సూర్యుడు అష్టదిక్కులు నదులు పర్వతములు సమస్తవిధముల శుద్ధజలములు మాకు శాంతి ప్రదములగుగాక! వేదోపదేశము చేయు ఆచార్యులు బ్రహ్మచారులు మాకు శాంతిని చేకూర్చుదురుగాక! వేదమాత పుత్రులైన బ్రహ్మనిష్ఠులు, బ్రహ్మజ్ఞానులు, బ్రహ్మవేత్తలు, తపోధనులు, త్యాగులు, వీతరాగులు మాకు శాంతిని ప్రసాదించుగాక!

శ్రేష్ఠము ప్రసిద్ధమైన శాస్త్రవేత్తలు, కళానైపుణ్యము కలిగిన శిల్పులు, వైద్యులు, ధర్మాత్ములైన పితరులు మాకు శాంతినిత్తురుగాక! పరమాత్ముడు సమస్త ప్రాణికోటికి శాంతిని ప్రసాదించుగాక! సమస్త జడదేవతలు మాకు శాంతి కారకములగును గాక! పగలు రాత్రి శుభంకరములై మాకు శాంతిని వర్షింపచేయుగాక! సర్వవ్యాపకుడైన పరమాత్ముడు మాకు శాంతినిచ్చి సమస్త అభీష్టములను సిద్ధింపచేయుగాక! ఓషధీ వనస్పతులు మమ్ములను రోగరహితములు చేయుగాక! వసుదేవతలైన సూర్యచంద్ర నక్షత్రాదులు

పృథివి జలము అగ్ని వాయువు ఆకాశాది జడదేవతలు మమ్ములను సర్వదా రక్షించి కాపాడుదుగాక! ప్రకృతి ప్రళయములు భీభత్సములు సంభవించకుండుగాక! ప్రాణికోటికి ప్రమాదము వాటిల్లు సమస్త ఉపద్రవములను పరమాత్ముడు పరిహరించుగాక! సమస్త విశ్వము సంపూర్ణముగ శాంతినిచ్చుగాక! ఆ శాంతి నాలో చేరి నన్ను వర్ధిల్లచేయుగాక! హేపరమాత్మా! మాకు మిత్రులు శత్రువులు ప్రత్యక్షంగా వున్నవారు పరోక్షంగా ఉన్నవారు తెలిసినవారు తెలియని వారితో మాకు భయము లేకుండుగాక! సర్వవేళలా సర్వదిక్కుల నుండి మేము నిర్భయులమై ఉందుముగాక! శాంతిప్రదాత పరమాత్ముడు మాకు శాంతిని అభయమును ప్రసాదించుగాక!

ఆదిమధ్యాంత రహితుడు సర్వద్రష్టయైన పరమాత్ముడు విద్వజ్జనములకు మోక్షధామమును దర్శింపచేయుగాక! ఆ సర్వసాక్షి కృపవలన శతాధికవర్షములు దివ్యవాణితో సంభాషించెదము గాక! మంగళమయనేత్రములతో శతవర్షములు యజ్ఞయాగాది శుభకార్యములను దర్శించెదముగాక! నిరంతరము మా శ్రోత్రములతో శుభంకరమైన మంజులనాదమును - వేదస్తుతులను విందుముగాక! సర్వదా స్వతంత్రులుగా జీవింతుముగాక!

కర్మనిష్ఠులు, కర్మయోగులు, జ్ఞానులు, జ్ఞానయజ్ఞములు చేయువారి అంతఃకరణము శుభసంకల్పమగునుగాక! జ్ఞానకర్మ ఉపాసనల తపస్సు కలిగిన మనస్సునకు నాశరహితుడైన పరమాత్ముని సాక్షాత్కారము లభించుగాక! భూత భవిష్యత్ వర్తమాన కాలాల్లో సప్తహోతలతో జ్ఞానేంద్రియములతో చేయబడు మనోయజ్ఞముతో నా అంతఃకరణము శివసంకల్పమగునుగాక! ఋగ్వేదాది చతుర్వేదముల జ్ఞానముతో నిండివున్న నా మనస్సు మంగళప్రదమగునుగాక!



## అథ శాన్తికరణ మంత్రాః

ఓం శన్న ఇన్ద్రాగ్నీ భవతామవోభిః శన్న ఇన్ద్రా వరుణా రాతహవ్యా।
శమిన్ద్రా సోమా సువితాయ శంయోః శన్న ఇన్ద్రా పూషణా వాజసాతౌ॥

ఓం శన్నో భగః శమునః శంసో అస్తు, శన్నః పురంధిః శము సంతురాయః।
శన్నః సత్యస్య సుయమస్య శంసః శన్నో అర్యమా పురుజాతో అస్తు॥

ఓం శన్నో ధాతా శము ధర్తానో అస్తు శన్న ఉరూచీ భవతు స్వధాభిః।
శం రోదసీ బృహతీ శం నో అద్రిః శంనో దేవానాం సుహవాని సంతు॥

ఓం శన్నో అగ్ని ర్జ్యోతి రనీకో అస్తు శన్నో మిత్రా వరుణా వశ్వినా శం।
శన్నః సుకృతాం సుకృతాని సంతు శన్న ఇషిరో అభివాతు వాతః॥

ఓం శన్నో ద్యావా పృథివీ పూర్వహూతౌ శమంతరిక్షం దృశయే నో అస్తు।
శం న ఓషధీర్వనినో భవంతు శం నో రజసస్పతి రస్తు జిష్ణుః॥

ఓం శన్న ఇన్ద్రో వసుభిర్దేవో అస్తు శమాదిత్యేభి ర్వరుణః సుశంసః।
శం నో రుద్రో రుద్రేభి ర్జలాషః శం న స్త్వష్టాగ్నాభిరిహ శృణోతు॥

ఓం శం నః సోమో భవతు బ్రహ్మ శం నః. శం నో గ్రావాణః శము సంతు యజ్ఞాః।
శం నః స్వరూణాం మితయో భవంతు, శం నః ప్రస్వః శమ్వస్తు వేదిః॥

ఓం శం నః సూర్య ఉరుచక్షా ఉదేతు శం న శ్చతస్రః ప్రదిశో భవంతు।
శం నః పర్వతా ధ్రువయో భవంతు శం నః సింధవః శము సన్త్వాపః॥

ఓం శం నో అదితి ర్భవతు వ్రతేభిః శం నో భవంతు మరుతః స్వర్కాః।
శం నో విష్ణుః శము పూషా నో అస్తు శం నో భవిత్రం శమ్వస్తు వాయుః॥

ఓం శం నో దేవః సవితా త్రాయమాణః శం నో భవంతూషసో విభాతీః।
శం నః పర్జన్యో భవతు ప్రజాభ్య శం నః క్షేత్రస్య పతి రస్తు శంభుః॥

ఓం శం నో దేవా విశ్వ దేవా భవంతు శం సరస్వతీ సహాధీభి రస్తు।
శమభిషాచః శము రాతిషాచః శం నో దివ్యాః పార్థివాః శం నో అప్యాః॥

ఓం శం నః సత్యస్య, పతయో భవంతు శం నో అర్వంత శ్శము సంతు గావః।
శం న ఋభవ స్సుకృత స్సుహస్తాః శం నో భవంతు పితరో హవేషు॥

ఓం శం నో అజ ఏకపాద్దేవో అస్తు శం నోఽహిర్బుధ్న్యః శం సముద్రః।
శం నో అపాం నపాత్పేరు రస్తు శం నః పృశ్నిర్భవతు దేవ గోపా॥

ఓం ఇంద్రో విశ్వస్య రాజతి శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే॥

ఓం శం నో వాతః పవతాగ్ం శ న స్తపతు సూర్యః।
శం నః కనిక్రదద్దేవః పర్జన్యో అభివర్షతు॥

ఓం అహాని శం భవంతు న శ్శగ్ం రాత్రీః ప్రతిధీయతామ్
శం న ఇంద్రాగ్నీ భవతా మవోభిః।
శం న ఇంద్రావరుణా రాతహవ్యా శ న ఇంద్రాపూషణా వాజసాతౌ
శమింద్రా సోమా సువితాయ శంయోః॥

ఓం శం నో దేవీ రభిష్టయ ఆపో భవంతు పీతయే। శంయో రభి స్రవంతు నః॥

ఓం ద్యౌః శాంతి రంతరిక్షగ్ం శాంతిః పృథివీ శాంతిః
ఆపః శాంతి రోషధయః శాంతి ర్వనస్పతయ శ్శాంతిః।
విశ్వేదేవాః శాంతిర్బ్రహ్మ శాంతిః సర్వగ్ం శాంతిః
శాంతిరేవ శాంతి స్సా మా శాంతిరేధి॥

ఓం తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్ర ముచ్చరత్ పశ్యేమ శరదః శతమ్
జీవేమ శరదః శతగ్ం, శృణుయామ శరదః శతమ్
ప్రబ్రవామ శరదః శతం అదీనాః స్యామ శరదః శతమ్
భూయశ్చ శరదః శతాత్॥

ఓం యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదు సుప్తస్య తథైవైతి।
దూరంగమం జ్యోతిషాం జ్యోతి రేకం తన్మే మనః శివసంకల్పమస్తు॥

ఓం యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞే కృణ్వంతి విదథేషు ధీరాః
యదపూర్వం యక్షమన్తః ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు॥

ఓం యత్ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చ యజ్జ్యోతిరంత రమృతం ప్రజాసు।
యస్మాన్న ఋతే కించన కర్మక్రియతే తన్మే మనః శివసంకల్పమస్తు॥

ఓం యేనేదం భూతం భువనం భవిష్య త్పరిగృహీత మమృతేన సర్వమ్।
యేన యజ్ఞ స్తాయతే సప్త హోతా తన్మే మనః శివసంకల్పమస్తు॥

ఓం యస్మిన్నృచః సామ యజూగ్ంషి యస్మిన్ ప్రతిష్ఠితా రథనాభావివారాః
యస్మిం శ్చిత్తగ్ం సర్వమోతం ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు॥

ఓం సుషారథి రశ్వానివ యన్మనుష్యాన్నేనీయతే 2భీషుభి ర్వాజిన ఇవ।
హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం తన్మే మనః శివసంకల్పమస్తు॥

ఓం స నః పవస్వ శం గవే శం జనాయ శమర్వతే । శం రాజన్నోషధీభ్యః॥

ఓం అభయం నః కరత్యంతరిక్ష మభయం ద్యావాపృథివీ ఉభే ఇమే।
అభయం పశ్చా దభయం పురస్తా దుత్తరా దధరా దభయం నో అస్తు॥

ఓం అభయం మిత్రా దభయ మమిత్రా దభయం జ్ఞాతా దభయం పరోక్షాత్
అభయం నక్త మభయం దివా నః సర్వా ఆశా మమ మిత్రం భవంతు॥

(ఇతి శాంతికరణ మంత్రాః)







## ద్వితీయ దేవయజ్ఞము - వ్యాఖ్యానము

భారతీయ సంస్కృతికి మూలాధారమైన పంచ మహాయజ్ఞములలో దేవ యజ్ఞము రెండవది. యజ్ఞమనగా దేవపూజ, సంగతికరణము, దానము అను మూడు శ్రేష్ఠ కర్మల కలయిక. పృథివ్యాది పంచభూతములను శుద్ధమొనర్చు ప్రక్రియకు దేవపూజ యనిపేరు. మంచి వస్తువుల, మంచివారల సమీకరణమును సంగతికరణమందురు. యజ్ఞము చేయుట ద్వారా యజ్ఞకర్త పరిసర వాతావరణమును శుద్ధమొనర్చి తోటి ప్రాణులకు స్వస్థతను అనగా ఆరోగ్యమును దానము చేయును. ఇట్టి శ్రేష్ఠతమ కర్మను మన పూర్వులు నిత్యము ప్రాతః సాయం సంధ్యా సమయములలో కర్తవ్య కర్మగ ఆచరించుచున్నట్లు మన ఇతిహాస గాథలు తెలియచేయుచున్నవి. రాజులు తమ దేశమున సకాలములో వర్షములు కురిసి చక్కని పంటలు పండి సకల ఐశ్వర్యములతో తులతూగుతూ ప్రజలంతా సుఖశాంతులతో జీవించుటకై అశ్వమేధాది బృహత్ యాగములను ఋషులచే చేయించుచుండిరి. భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు

**అన్నాద్ భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః।**
**యజ్ఞాత్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥**

అని ఈ యజ్ఞము వలన సకాలములో వర్షములు కురిసి పంటలు పండి ప్రాణుల కన్నము లభించునని ఉపదేశించిరి.

ఇట్టి వైజ్ఞానిక ప్రక్రియయైన యజ్ఞముపై నేడు ప్రపంచములోని అనేక దేశములందలి వైజ్ఞానికులు పరిశోధనలు గావించుచున్నారు. పశ్చిమ జర్మనీ, అమెరికా సంయుక్త రాష్ట్రములు, పోలెండు, చిలీ వంటి అనేక దేశములలో ఈ అగ్నిహోత్ర(యజ్ఞ)ము ద్వారా చికిత్సను, వ్యవసాయమును చేయుచున్నారు. అగ్నిహోత్ర భస్మముతో 1. భస్మములు, 2 ఆయింట్‌మెంట్లు, 3.కేప్స్యూల్స్, 4.క్రీమ్స్ 5. ఐ డ్రాప్స్ 6. ఇన్హైలేషన్స్ మున్నగు రకరకముల ఔషధములను తయారు చేయుచున్నారు. వీనితో అనేక వ్యాధులను నయము చేయుటయు జరుగుచున్నది.

అగ్నిహోత్ర వాతావరణములో మొక్కలను పెంచిన ఒక అద్భుతమైన మార్పు గోచరమగునని పరిశోధనలలో కనుగొనిరి. చిలీలోని సెంటియాగో వద్ద పొలములో ఇర్విన్ జక్కరియన్ అను వ్యవసాయదారుడు ప్రతినిత్యము అగ్నిహోత్రము చేసి ఆలుగడ్డలు, టమాటాలు,చిక్కుళ్ళు వంటి పంటలను పండించుటలో రసాయనిక ఎరువులను, క్రిమిసంహారక మందులు లేకుండానే అత్యాశ్చర్యకరమయిన ఫలితములను సాధించుచున్నట్లు తెలుపుచున్నాడు. క్లాస్‌విల్హెమ్ అను పశ్చిమ జర్మన్ వాస్తవ్యుడు అగ్నిహోత్రపు వాతావరణములో మొక్కలు ఆరోగ్యముగ బలముగ పెరుగునని చెప్పుచున్నాడు. పోలెండులో అగ్నిహోత్రమును గూర్చి అనేక నగరములలో భారీ ఎత్తున ప్రచారము జరుపబడుచున్నది.

మానవుడు జగత్తునకెంత ఉపకారము చేయునో అంతే సుఖము అతనికి ఈశ్వరుని వ్యవస్థవలన లభించుననునది వైదిక కర్మ సిద్ధాంతము. వాయు మండలమును శుద్ధి చేయుటలో రెండు విధముల ప్రయత్నములున్నవి. ఒకటి ఈశ్వరునిచే చేయబడిన వ్యవస్థ. రెండవది మానవుని ప్రయత్నము. వీనిలో మొదటిది ఈశ్వరుడు అగ్నిరూప సూర్యుని మరియు సుగంధరూప పుష్పాది పదార్థములనుత్పన్నము చేసెను. ఆ సూర్యుడు నిరంతరము జగత్తులోని పదార్థములలోని రసములను పైకాకర్షించుచుండును. పుష్పాదులలోని సుగంధము కూడ వాతావరణములోని దుర్గంధమును నివారించుచుండును. రెండవది – మానవ ప్రయత్నము. జగత్తులో దేహధారులైన ప్రాణులన్నింటిలో మానవుడు ఉత్తముడు, కనుక అందరికి ఉపకరించు యజ్ఞమును చేయనందువలన మనుష్యునకు దోషము కలుగును.

ఇట్లు సకల జగత్కళ్యాణ కారకమైన ఈ యజ్ఞ ప్రక్రియ ప్రపంచము నందలి నేటి సంస్కృతులన్నింటికిని ఆది సంస్కృతియైన వైదిక సంస్కృతి నుండియే ఆవిర్భవించినదనుట మనకెంతో గర్వకారణము.

## సంకల్పము

### పురోహితుడు యజ్ఞ యజమానులచే సంకల్పము చెప్పించును

ఓమ్ తత్సత్ ఆద్య బ్రహ్మణః ద్వితీయ ప్రహరార్ధే శ్వేతవరాహకల్పే సప్తమే వైవస్వత మన్వంతరే అష్టావింశతి తమే చతుర్యుగే కలియుగే ప్రథమ పాదే ప్రథమచరణే ఆర్యావర్త దేశే పుణ్య భూమౌ జంబూద్వీపే భరతవర్షే భరత ఖండే మేరోః దక్షిణ దిక్భాగే శ్రీశైలస్య వాయవ్య ప్రదేశే కృష్ణాగోదావరీ నద్యోః మధ్యదేశే తెలంగాణా రాజ్య అంతర్గత భాగ్యనగరే ...... ప్రాంతే అస్మాకం శోభన గృహే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన *శ్రీ మన్మథ* నామ సంవత్సరే *ఉత్తరాయణే వసంతఋతౌ చైత్రమాసే శుక్లపక్షే భానువాసరే* అశ్వనీ నక్షత్రే శుభయోగే శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం *ప్రతిపద్యాం తిథౌ* - (పాడ్యమి) - *జమదగ్ని మహర్షి గోత్రోత్పన్నః* శ్రీమాన్ .... నామాహం మమ ధర్మపత్నీ సమేతః సౌభాగ్యవతి శ్రీమతి ...... నామ్నీం *నూతన గృహ ప్రవేశ సంస్కార* శుభ సందర్భే మమ గృహే ఆయురారోగ్య ఐశ్వర్య, సిద్ధ్యర్థం లోకకళ్యాణార్థం తథా వైదిక ధర్మ ప్రాచుర్యార్థం పరమేశ్వర ప్రీత్యర్థం విశ్వమంగళ హోమం కరణాయ భవతీం వృణే - పురోహితురాలు .. **వృతాస్మి** - భవంతం - వృణే పురోహితుడు .. **వృతోస్మి.**

### ఆచమన మంత్రములు

ఓం అమృతోపస్తరణ మసి స్వాహా। (1. ఆచ.)

ఓం అమృతాపిధాన మసి స్వాహా। (2. ఆచ.)

ఓం సత్యం యశః శ్రీర్మయి శ్రీః శ్రయతాం స్వాహా॥ (3. ఆచ.)

## అగ్నిహోత్ర మంత్రములు

## అంగస్పర్శ మంత్రములు

ఈ క్రింది మంత్రములతో ఆ యా ఇంద్రియములను స్పృశింపవలయును.

ఓం వాఙ్మ ఆస్యే2స్తు। (పెదవులను)

ఓం నసోర్మే ప్రాణో2స్తు। (నాసికా రంధ్రములను)

ఓం అక్ష్ణో ర్మే చక్షురస్తు। (నయనములను)

ఓం కర్ణ యోర్మే శ్రోత్రమస్తు। (చెవులను)

ఓం బాహ్వో ర్మే బలమస్తు। (భుజములను)

ఓం ఊర్వోర్మ ఓజో2స్తు। (ఊరువులను)

ఓం అరిష్టాని మే2ఙ్గాని తనూ స్తన్వామే సహ సంతు॥

(శరీరమందంతట జలమును ప్రోక్షింపవలయును)

## అగ్న్యాధాన మంత్రము

ఓం భూర్భువః స్వః । ఓం భూర్భువః స్వర్ద్యౌరివభూమ్నా పృథివీవ వరిమ్ణా తస్యాస్తే పృథివి దేవయజని। పృష్ఠే2గ్ని మన్నాద మన్నాద్యాయాదధే॥

## అగ్నినుత్తేజింపజేయు మంత్రము

ఓం ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహి త్వమిష్టా పూర్తే సగ్ం సృజేథామయం చ। అస్మిన్ త్సధస్థే అధ్యుత్త రస్మిన్ విశ్వేదేవా యజమానశ్చ సీదత॥

## సమిధాధాన మంత్రములు

ఓం అయన్త ఇధ్మ ఆత్మా జాతవేద స్తేనేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్। ప్రజయా పశుభిర్ బ్రహ్మవర్చసేనాన్నాద్యేన సమేధయ - స్వాహా॥
ఇదమగ్నయే జాతవేదసే ఇదం న మమ॥

ఓం సమిధాగ్నిం దువస్యత ఘృతైర్బోధయతాతిథిమ్। అస్మిన్ హవ్యాజుహోతన॥

ఓం సుసమిద్ధాయ శోచిషే ఘృతం తీవ్రం జుహోతన।
అగ్నయే జాతవేదసే - స్వాహా॥ ఇదమగ్నయే జాతవేదసే ఇదం న మమ॥

ఓం తన్త్వా సమిద్భి రంగిరో ఘృతేన వర్ధయామసి। బృహచ్ఛోచా యవిష్ఠ్య - స్వాహా॥
ఇద మగ్నయే అంగిరసే ఇదం న మమ.

## ఘృతాహుతి మంత్రము

ఓం అయన్త ఇధ్మ ఆత్మా జాతవేద స్తేనేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్।
ప్రజయా పశుభిర్ బ్రహ్మ వర్చసేనాన్నాద్యేన సమేధయ - స్వాహా॥
ఇదమగ్నయే జాతవేదసే ఇదం న మమ॥
ఈ మంత్రమును 5సార్లు చదువుచు 5 ఘృతాహుతు లివ్వవలయును.

## జలప్రసేచన మంత్రములు

ఓం అదితే2 నుమన్యస్వ।

ఓం అనుమతే2 నుమన్యస్వ।

ఓం సరస్వత్యనుమన్యస్వ।

ఓం దేవ సవితః ప్రసువ యజ్ఞం ప్రసువ యజ్ఞపతిం భగాయ।
దివ్యోగంధర్వః కేతపూః కేతన్నః పునాతు వాచస్పతిర్ వాచం నః స్వదతు॥

## ఆఘారా వాజ్యాభాగాహుతి మంత్రములు

ఓం అగ్నయే స్వాహా । ఇదమగ్నయ ఇదం న మమ॥

ఓం సోమాయ స్వాహా । ఇదం సోమాయ ఇదం న మమ॥

ఓం ప్రజాపతయే స్వాహా । ఇదం ప్రజాపతయే ఇదం న మమ॥

ఓం ఇంద్రాయ స్వాహా । ఇద మింద్రాయ ఇదం న మమ॥

## వ్యాహృత్యాహుతి మంత్రములు

ఓం భూరగ్నయే స్వాహా । ఇదమగ్నయ ఇదం న మమ॥

ఓం భువర్వాయవే స్వాహా । ఇదం వాయవ ఇదం న మమ॥

ఓం స్వరాదిత్యాయ స్వాహా । ఇద మాదిత్యాయ ఇదం న మమ॥

ఓం భూర్భువః స్వరగ్ని వాయ్వాదిత్యేభ్యః స్వాహా।
ఇద మగ్ని వాయ్వాదిత్యేభ్యః ఇదం న మమ॥

## స్విష్టకృదాహుతి మంత్రము

ఓం యదస్య కర్మణో2త్యరీరిచమ్ యద్వా న్యూన మిహాకరమ్ ।
అగ్నిష్టత్స్విష్టకృద్విద్యాత్సర్వం స్విష్టం సుహుతం కరోతు మే। అగ్నయే
స్విష్టకృతే సుహుతహుతే సర్వప్రాయశ్చిత్తా హుతీనాం కామానామ్
సమర్ధయిత్రే। సర్వాన్నః కామాన్ త్సమర్థయ స్వాహా॥
ఇద మగ్నయే స్విష్టకృతే ఇదం న మమ॥

## ప్రజాపత్యాహుతి

ఓం ప్రజాపతయే స్వాహా। (మనస్సులో)
ఇదం ప్రజాపతయే - ఇదం న మమ॥

## ప్రధానహోమ మంత్రములు

ఓం భూర్భువః స్వః।
అగ్న ఆయూంషి పవస ఆసువోర్జమిషం చ నః। ఆరేబాధస్వ దుచ్ఛునామ్
స్వాహా॥ ఇద మగ్నయే పవనాయ ఇదం న మమ॥

ఓం భూర్భువః స్వః।
అగ్నిర్ ఋషిః పవమానః పాంచజన్యః పురోహితః। తమీమహే మహాగయం
స్వాహా॥ ఇద మగ్నయే పవమానాయ ఇదం న మమ॥

ఓం భూ ర్భువః స్వః అగ్నే పవస్వ స్వపా అస్మే వర్చః సువీర్యం। దధద్రయిం మయి పోషం స్వాహా॥ ఇద మగ్నయే పవమానాయ ఇదం న మమ॥

ఓం భూ ర్భువః స్వః ప్రజాపతే న త్వ దేతాన్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ । యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణామ్ స్వాహా ॥ ఇదం ప్రజాపతయే ఇదం న మమ॥

## అష్టాజ్యాహుతి మంత్రములు

ఓం త్వన్నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేడో2వయాసిసీష్ఠాః। యజిష్ఠో వహ్నితమః శోశుచానో విశ్వాద్వేషాంసి ప్రముముగ్ధ్యస్మత్ స్వాహా॥
ఇద మగ్నీ వరుణాభ్యాం ఇదం న మమ॥

ఓం సత్వన్నో అగ్నే 2 వమో భవోతీ నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ। అవయక్ష్వనో వరుణం రరాణో వీహి మృడీకం సుహవో న ఏధి స్వాహా॥
ఇద మగ్నీ వరుణాభ్యాం ఇదం న మమ॥

ఓం ఇమం మే వరుణ శ్రుధీ హవ మద్యా చ మృడయ। త్వామవస్యు రాచకే స్వాహా॥ ఇదం వరుణాయ ఇదం న మమ॥

ఓం తత్త్వా యామి బ్రహ్మణా వందమాన స్తదాశాస్తే యజమానో హవిర్భిః అహేడమానో వరుణేహ బోధ్యు రుశగ్ం స మాన ఆయుః ప్రమోషీః స్వాహా॥ ఇదం వరుణాయ ఇదం న మమ॥

ఓం యేతే శతం వరుణయే సహస్రమ్ యజ్ఞియాః పాశా వితతా మహాన్తః।
తేభి ర్నో2ద్య సవితోత విష్ణుర్విశ్వే ముంచంతు మరుతః స్వర్కాః స్వాహా॥
ఇదం వరుణాయ సవిత్రే విష్ణవే విశ్వేభ్యో।
దేవోభ్యో మరుద్భ్యః స్వర్కేభ్యః ఇదం న మమ॥

ఓం అయాశ్చాగ్నే అస్యనభిశస్తి పాశ్చ సత్య మిత్త్వమయాసి।
అయానో యజ్ఞం వహాస్యయా నో ధేహి భేషజగ్ం స్వాహా॥
ఇదమగ్నయే అయసే ఇదం న మమ॥

ఓం ఉదుత్తమం వరుణ పాశమస్మదవాధమం వి మధ్యమం శ్రథాయ ।
అథావయ మాదిత్య వ్రతే తవానాగసో అదితయే స్యామ స్వాహా॥
ఇదం వరుణా యాదిత్యా యాదితయే చ ఇదం న మమ॥

ఓం భవత న్నః సమనసౌ సచేత సావరేపసౌ । మాయజ్ఞగ్ం హిగ్ంసిష్టమ్
మా యజ్ఞపతిం జాతవేదసౌ శివౌ భవత మద్య నః స్వాహా॥
ఇదం జాతవేదోభ్యాం ఇదం న మమ॥

## ప్రాతఃకాల హవన మంత్రములు

ఓం సూర్యో జ్యోతి ర్జ్యోతి సూర్యః స్వాహా।
ఓం సూర్యో వర్చో జ్యోతి ర్వర్చః స్వాహా।
ఓం జ్యోతిః సూర్యః సూర్యో జ్యోతిః స్వాహా।
ఓం సజూ ర్దేవేన సవిత్రా సజూ రుషసేంద్రవత్యా
జుషాణః సూర్యోవేతు స్వాహా॥

## సాయంకాల హవన మంత్రములు

ఓం అగ్నిర్జ్యోతి ర్జ్యోతి రగ్నిః స్వాహా।
ఓం అగ్ని ర్వర్చో జ్యోతి ర్వర్చః స్వాహా।
ఓం అగ్నిర్జ్యోతి ర్జ్యోతి రగ్నిః స్వాహా। (మనస్సులో)
ఓం సజూ ర్దేవేన సవిత్రా సజూ రాత్ర్యేంద్రవత్యా
జుషాణో అగ్నిర్వేతు స్వాహా॥

## ప్రాతస్సాయం సమయముల హవన మంత్రములు

ఓం భూ రగ్నయే ప్రాణాయ స్వాహా।
ఇద మగ్నయే ప్రాణాయ ఇదం న మమ॥

ఓం భువ ర్వాయవే అపానాయ స్వాహా।
ఇదం వాయవే అపానాయ ఇదం న మమ॥

ఓం స్వ రాదిత్యాయ వ్యానాయ స్వాహా।
ఇదమాదిత్యాయవ్యానాయ ఇదం న మమ॥

ఓం భూర్భువః స్వరగ్ని వాయ్వాదిత్యేభ్యః ప్రాణాపానవ్యానేభ్యః స్వాహా।
ఇద మగ్ని వాయ్వాదిత్యేభ్యః, ప్రాణాపానవ్యానేభ్యః ఇదం న మమ॥

ఓం ఆపో జ్యోతీరసో2మృతం బ్రహ్మ భూర్భువః స్వరోం స్వాహా॥

ఓం యాం మేధాం దేవగణాః పితర శ్చోపాసతే।
తయా మా మద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా॥

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ।
యద్భద్రం తన్న ఆసువ స్వాహా॥

ఓం అగ్నే నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్।
యుయో ధ్యస్మ జ్జుహురాణ మేనో
భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ స్వాహా॥

## సత్యవ్రత మంత్రములు

ఓం అగ్నే వ్రతపతే వ్రతం చరిష్యామి।
తత్తే ప్రబ్రవీమి, తచ్ఛకేయం, తేన బుధ్యాస
మిద మహ మనృతాత్ సత్యముపైమి స్వాహా॥
ఇదమగ్నయ ఇదం న మమ॥

ఓం వాయో వ్రతపతే వ్రతం చరిష్యామి।
తత్తే ప్రబ్రవీమి, తచ్ఛకేయం, తేన బుధ్యాస
మిద మహ మనృతాత్ సత్యముపైమి స్వాహా॥
ఇదం వాయవ ఇదం న మమ॥

ఓం సూర్య వ్రతపతే వ్రతం చరిష్యామి।
తత్తే ప్రబ్రవీమి, తచ్ఛకేయం, తేన ఋద్ధ్యాస
మిద మహ మనృతాత్ సత్యముపైమి స్వాహా॥
ఇదం సూర్యాయ ఇదం న మమ॥

ఓం చంద్ర వ్రతపతే వ్రతం చరిష్యామి।
తత్తే ప్రబ్రవీమి, తచ్ఛకేయం, తేన ఋద్ధ్యాస
మిద మహ మనృతాత్ సత్యముపైమి స్వాహా॥
ఇదం ఇంద్రాయ వ్రతపతయ ఇదం న మమ॥

ఓం వ్రతానాం వ్రతపతే వ్రతం చరిష్యామి।
తత్తే ప్రబ్రవీమి, తచ్ఛకేయం, తేన ఋద్ధ్యాస
మిద మహ మనృతాత్ సత్యముపైమి స్వాహా॥
ఇదం ఇంద్రాయ వ్రతపతయ ఇదం న మమ॥

**(ఈ గాయత్రీ మంత్రాన్ని మూడుసార్లు జపించి అగ్నిలో ఆహుతులివ్వాలి.)**

ఓం భూర్భువః స్వః । తత్సవితుర్వరేణ్యమ్
భర్గో దేవస్య ధీమహి । ధియో యోనః ప్రచోదయాత్ స్వాహా,
ఇదం సవిత్రే ఇదం నమమ॥

ఓం రాష్ట్రాయ స్వాహా । ఇదం రాష్ట్రాయ ఇదం న మమ॥
ఓం అర్చన్నను స్వరాజ్యం స్వాహా । ఇదం అర్చన్నను స్వరాజ్యం ఇదం న మమ॥

**చివరగా స్విష్ట కృదాహుతి మంత్రము - ప్రాజాపత్యాహుతి మంత్రములు**

ఓం సర్వం వై పూర్ణగ్ం స్వాహా।
ఓం సర్వం వై పూర్ణగ్ం స్వాహా।
ఓం సర్వం వై పూర్ణగ్ం స్వాహా।

ఓం వసోః పవిత్ర మసి శతధారం, వసోః పవిత్ర మసి సహస్రధారం దేవస్త్వా
సవితా పునాతు, వసోః పవిత్రేణ శతధారేణ సుప్వా కామ ధుక్షః స్వాహా॥

## పూర్ణాహుతి మంత్రము

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మేవావశిష్యతే॥
ఇదం పూర్ణాయ ఇదం న మమ॥ (బృహదారణ్యకోపనిషత్తు)

హే పరమాత్మా! నీవు పరిపూర్ణుడవు. ఈ జగత్తు కూడా సంపూర్ణమైనదే. మేము ఏఏ కోరికలతో నిన్ను ఆశ్రయించుచున్నామో అవి అన్నియు మాకు సిద్ధించును గాక! మేము విజ్ఞానాది ధనములకు అధిపతులము అగుదుము గాక! శతాధిక వర్షముల మా గృహములందు వేదవిహిత శుభకార్యములను ఆచరించెదము గాక! విద్యా జ్ఞానాదులను పొంది పరమ సుఖములను అనుభవించెదము గాక! సత్యము న్యాయము ధర్మములను సర్వదా పాలింతుము గాక! మా పూర్వులు విద్వాంసులు అనుసరించిన ధర్మ మార్గమును మేమును అనుసరించెదము గాక! మా సంతానము సర్వదా సరస్వతీ పుత్రులై సంస్కారవంతులై లోకమందు ప్రసిద్ధిని పొందుదురు గాక! మేము శతవర్షములు శుభాశయముతో జీవింతుము గాక! మా హృదయమునందు పరాత్పరుడు సర్వదా శుభ సంకల్పములను ఉదయింపచేయు గాక!

## ప్రార్థన

ఓం తేజోఽసి తేజో మయిధేహి।
హే అనంత ప్రకాశయుక్త పరమేశ్వరా మా యందును పూర్ణప్రకాశము నుంచుము.

ఓం వీర్యమసి వీర్యం మయిధేహి।
హే అనంత పరాక్రమ యుక్త పరమేశ్వరా! మాయందును పూర్ణ పరాక్రమము నుంచుము.

ఓం బలమసి బలం మయిధేహి
హే అనంత బలయుక్త పరమేశ్వరా! మాయందును పూర్ణ బలము నుంచుము.

ఓం ఓజోఽసి ఓజో మయిధేహి।
హే అనంత సామర్థ్యయుక్త పరమేశ్వరా! మాయందును పూర్ణ సామర్థ్యము నుంచుము.



ఓం మన్యురసి మన్యుం మయిధేహి।
హే పరమేశ్వరా! నీవు దుష్టుల యందును దుష్టకార్యములయందును క్రోధకారివి. మమ్ములను అట్లే కావింపుము.

ఓం సహోఽసి సహోమయిధేహి।
హే జగదీశ్వరా! నీవు నిందాస్తుతుల యందు సహనము కలవాడవు. మమ్ములను అట్లే కావింపుము.

సర్వే భవంతు సుఖినః సర్వే సంతు నిరామయాః।
సర్వే భద్రాణి పశ్యంతు, మా కశ్చిద్ దుఃఖభాగ్భవేత్॥

కాలే వర్షతు పర్జన్యః, పృథివీ సస్యశాలినీ।
లోకోఽయం క్షోభరహితః, సజ్జనాః సంతు నిర్భయాః॥

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం, న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం, లోకాస్సమస్తా స్సుఖినో భవంతు॥

## రాష్ట్రీయ ప్రార్థన

ఓమ్ ఆ బ్రహ్మన్ బ్రాహ్మణో బ్రహ్మవర్చసీ జాయతామ్।
ఆ రాష్ట్రే రాజన్యః శూర ఇషవ్యోఽతి వ్యాధీ మహారథో జాయతామ్।
దోగ్ధ్రీ ధేనుర్వోఢాఽనడ్వానాశుః సప్తిః పురంధి ర్యోషా జిష్ణూరథేష్ఠాః।
సభేయో యువాస్య యజమానస్య వీరో జాయతాం।
నికామే నికామే నః పర్జన్యో వర్షతు । ఫలవత్యో న ఓషధయః పచ్యన్తాం
యోగక్షేమో నః కల్పతామ్॥ (యజుర్వేదం 22-22)

ఓం శాంతిః శాంతిః శాంతిః

## యజ్ఞ దంపతులకు యజ్ఞానంతర ఆశీర్వాదము

### మంగళాశీస్సులు

ఓం సత్యాః సంతు యజమానస్య కామాః॥

ఓం సఫలాః సంతు యజమానస్య కామాః॥

ఓం భద్రాః సంతు యజమానస్య కామాః॥

ఓం పూర్ణాః సంతు యజమానస్య కామాః॥

ఓం ఇంద్రశ్రేష్ఠాని ద్రవిణాని ధేహి
చిత్తిం దక్షస్య సుభగత్వ మస్మే।
పోషం రయీణాం అరిష్టిం తనూనామ్
స్వాద్మానం వాచః సుదినత్వ మహ్నామ్॥ (ఋగ్వేదము)

ఓం ధ్రువాసి ధ్రువో2యం యజమానే
అస్మిన్నాయతనే ప్రజయా పశుభిర్।
భూయాత్ ఘృతేన ద్యావా పృథివీ పూర్యేథామ్
ఇంద్రస్య ఛదిరసి విశ్వజనస్య ఛాయా॥ (యజుర్వేదము)

ఓం శతం జీవ శరదో వర్ధమానః శతం హేమంతాన్
శత ము వసంతాన్ । శం ఇంద్రాగ్నీ సవితా బృహస్పతిః
శతాయుషా హవిషేమం పునర్దుః॥ (ఋగ్వేదం 10-161-4)

అఖండ సౌభాగ్యవతీ భవ!

ఆయుష్మాన్ భవ!

శుభమస్తు!

ఓమ్ స్వస్తి ఓమ్ స్వస్తి ఓమ్ స్వస్తిః!

## సంగఠన సూక్తం

ఓం సం సమిద్యువసే వృషన్నగ్నే విశ్వాన్యర్య ఆ।
ఇడ స్పదే సమిధ్యసే సనో వసూన్యాభర॥

హే ప్రభో తుమ్ శక్తిశాలీ హెూ బనాతే సృష్టికో,
వేద సబ్ గాతే తుమ్హే హై కీజియే ధన్ వృష్టికో.

ఓం సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవో మనాంసి।
జానతామ్ । దేవా భాగం యథాపూర్వే సంజానానా ఉపాసతే॥

ప్రేమ సే మిల్‌కర్ చలో బోలో సభీ జ్ఞానీ బనో,
పూర్వజోంకీ భాంతి తుమ్ కర్తవ్య కే మానీ బనో.

ఓం సమానో మంత్రః సమితిః సమానీ।
సమానం మనః సహచిత్త మేషామ్। సమానం మంత్ర।
మభిమంత్ర యే వః సమానేన వో హవిషా జుహెూమి॥

హెూ విచార్ సమాన్ సబకే చిత్తమన్ సబ్ యేక్‌హెూ,
జ్ఞాన్ దేతాహూ బరాబర్ భోగ్య పా సబ్‌నేక్ హెూ.

ఓం సమానీవ ఆకూతిః సమానాహృదయాని వః।
సమానమస్తు వో మనో యథావః సుసహాసతి॥
హెూ సభీకే దిల్ తథా సంకల్ప్ అవిరోధీ సదా,
మన్ భరేహెూ ప్రేమ్‌సే జిస్‌సే బఢే సుఖ్ సంపదా.

## శాంతిపాఠ మంత్రము

ఓం ద్యౌః శాంతి రంతరిక్షగ్ం శాంతిః పృథివీ శాంతి
రాపః శాంతిః ఓషధయః శాంతిః । వనస్పతయః శాంతిః
విశ్వేదేవాః శాంతిః, బ్రహ్మ శాంతిః, సర్వగ్ం శాంతిః
శాంతిరేవ శాంతిః, సా మా శాంతి రేధి.

ఓం శాంతిః శాంతిః శాంతిః



# అమావాస్యేష్టి మంత్రాః

## అమావాస్యేష్టి మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము

సమస్త చరాచర జగత్తు అంతర్యామియైన పరమేశ్వరుని వశము నందున్నది. పరమాత్ముడు సృజించిన పదార్థములను భక్తిత్యాగ సమర్పణ భావములతో అందరు వినియోగించుకోవాలి. మనుష్యులు సర్వదా పురుషార్థపరులు కావాలి. సమాజాన్ని సర్వదా సంరక్షించే పరాక్రమ వంతులుగా వర్థిల్లాలి. పరమేశ్వరుడే అనుపముడు సర్వశక్తిమంతుడు సమస్త మానవులకు ఆయనే శరణాగతి. ఆ లోకపూజ్యుని అనుగ్రహముతో ఉత్తమ వేదవిద్యల జ్ఞానమును పొందాలి. సర్వదా పరమేశ్వర ఆరాధనలో తరించాలి.

ఓం యత్తేదేవా అకృణ్వన్భాగధేయమమావాస్యే సం వసన్తో మహిత్వా।
తేనానో యజ్ఞం పిపృహి విశ్వవారే రయిం నోధేహి సుభగే సువీరం స్వాహా॥
ఇదమమావాస్యాయై ఇదన్నమమ॥

అహమేవాస్మ్యమావాస్యా 3 మామా వసన్తిసుకృతో మయీమే।
మయిదేవా ఉభయే సాధ్యాశ్చేన్ద్ర జ్యేష్ఠాః సమగచ్ఛన్తి సర్వేస్వాహా॥
ఇదమమావాస్యాయై ఇదన్నమమ॥

ఆగన్రాత్రీ సంగమనీ మసూనామూర్జం పుష్టం వస్వావేశయన్తీ।
అమావాస్యాయై హవిషా విధేమోర్జం దుహానా పయసాన ఆగన్స్వాహా॥
ఇదమమావాస్యాయై ఇదన్నమమ॥

అమావాస్యేనత్వదేతాన్యన్యో విశ్వారూపాణి పరిభూర్జజాన।
యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తువయం స్యామ పతయో రయీణాం స్వాహా॥
ఇదమమావాస్యాయై ఇదన్నమమ॥ (అథర్వ కాం. 7 సూ79 మం. 1-4)

ఓం అగ్నయే స్వాహా। ఇదం అగ్నయే ఇదం న మమ॥
ఓం ఇన్ద్రాగ్నీభ్యాం స్వాహా। ఇదం ఇన్ద్రాగ్నీభ్యాం ఇదం న మమ॥
ఓం విష్ణవే స్వాహా। ఇదం విష్ణవే ఇదం న మమ॥



## పౌర్ణమాసేష్టిమంత్రాః

## పౌర్ణమాసేష్టి మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము

ఆది మధ్యాంత రహితుడైన పరమాత్ముడు సర్వోత్కృష్టుడు. ఆయనను ఆశ్రయించిన మానవులు ఉత్తమ గుణవంతులై మోక్షానందమును అనుభవిస్తారు. మానవుడు సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుని ఉపాసించి పురుషార్థపరుడు, ఐశ్వర్యవంతుడు అవుతాడు. అనాది అనంతుడైన పరమేశ్వరుని పూజించి మానవులందరూ సుఖ సంతోషాలతో జీవిస్తారు.

ఓం పూర్ణా పశ్చాదుత పూర్ణాపురస్తాదున్మధ్యతః పౌర్ణమాసీ జిగాయ।
తస్యాం దేవీః సంవసన్తో మహిత్వానాకస్యపృష్ఠే సమిషామదేమ స్వాహా॥
ఇదం పౌర్ణమాస్యై ఇదన్న మమ॥
వృషభం వాజినం వయం పౌర్ణమాసం యజామహే।
సనో దదాత్వక్షితాం రయిమను పదస్వతీమ్ స్వాహా॥
ఇదం పౌర్ణమాస్యై ఇదన్న మమ॥

ప్రజాపతే నత్వదేతాన్యన్యో విశ్వారూపాణి పరిభూర్జజాన।
యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తువయంస్యామ పతయో రయీణాం స్వాహా॥
ఇదం ప్రజాపతయే ఇదన్న మమ॥

పౌర్ణమాసీ ప్రథమాయజ్ఞియాసీదహ్నాం రాత్రీణామతి శర్వరేషు ।
యే త్వాం యజ్ఞైర్యజ్ఞియే అర్ధ యన్త్యమీతే నాకే సుకృతః ప్రవిష్టాః స్వాహా॥
ఇదం పౌర్ణమాస్యై ఇదన్న మమ॥ అథర్వ. కాం. 21, సూ. 80 మం. 1-4

ఓం అగ్నయే స్వాహా। ఇదం అగ్నయే ఇదం న మమ॥
ఓం అగ్నిషోమాభ్యాం స్వాహా। ఇదం అగ్నిషోమాభ్యాం ఇదం న మమ॥
ఓం విష్ణవే స్వాహా। ఇదం విష్ణవే ఇదం న మమ॥



## విశేషమంత్రములు

### 1. గాయత్రీ మహామంత్రము

ఓం భూర్భువః స్వః
తత్స వితుర్వరేణ్యమ్
భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్॥ (ఋగ్వేదం 3-62-10)

హే రక్షకా! సచ్చిదానంద స్వరూపా, నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావా, అజ నిరంజన నిరాకార సర్వవ్యాపకా సర్వాంతర్యామిన్ జగదుత్పాదకదేవా! నీ దివ్యము వరేణ్యమునైన సచ్చిదానంద స్వరూపమును మేము సర్వదా మా హృదయమున ధ్యానింతుము. మాకు సద్బుద్ధినిచ్చి సద్వ్రతములను ఆచరించునట్లు మమ్ము అనుగ్రహింతువు గాక!

ప్రతి నిత్యం బ్రహ్మ ముహూర్తంలో నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకొని ఏకాంతంగా పద్మాసనంలో కూర్చుండి, అత్యంత శ్రద్ధానిష్ఠలతో ఈ జపాన్ని చేయాలి. అందువలన బుద్ధి సూక్ష్మమై వేగవంతమౌతుంది. తద్వారా కఠినమైన అంశాలను, బ్రహ్మవిద్యలకు సంబంధించిన శాస్త్ర - విషయాలను తెలుసుకొనే సామర్థ్యం కలుగుతుంది. అంతేకాక ధారణాశక్తి, మనోనిగ్రహం, స్మరణశక్తి పెరుగుతాయి. బుద్ధిలోను, దేహంలోను విశేషమైన మార్పులు గోచరిస్తాయి. తద్వారా ప్రేరణదాయకమైన ఉత్సాహం ఆత్మానందం కలుగుతాయి. ప్రచోదయాత్ అనే శబ్దార్థం జీవితంలో ప్రవేశించి మానవజీవితాన్ని విశేషమైన మలుపు త్రిప్పుతుంది, మనలను ప్రభావితం చేస్తుంది.

## 2. వరదాయిని - వేదమాత

ఓం స్తుతామయా వరదా వేద మాతా
ప్రచోదయంతాం పావమానీ ద్విజానామ్।
ఆయుః ప్రాణం ప్రజాం పశుం కీర్తిం ద్రవిణం
బ్రహ్మవర్చసమ్, మహ్యందత్వావ్రజత బ్రహ్మలోకమ్ స్వాహా॥
ఇదం వేదమాత్రే ఇదం న మమ॥ (అథర్వవేదం 19-71-1)

లోకములను పాలించు వేదమాతయైన పరమేశ్వరిని మేము అత్యంత భక్తిశ్రద్ధలతో ప్రార్థించుచున్నాము. వరములనిచ్చు దివ్యమైన వేదమాత మాకు ఆరోగ్యప్రదమైన ఆయువును, దృఢమైన ప్రాణశక్తిని, ప్రశస్తమైన కీర్తిని, విశేషమైన బ్రహ్మజ్ఞానమును, శుభప్రదమైన పాడిపశువులను, న్యాయార్జితములైన ధనములను, సంస్కారవంతమైన సంతానము నిచ్చి మమ్ములను సర్వదా సన్మార్గమున, స్వస్తి మార్గమున నడిపించుగాక! మేము శతాధిక వర్షములు వేదవిహిత ధర్మకర్మలను ఆచరించుచు జీవించెదము గాక!

## 3. మృత్యుంజయ మహామంత్రము

ఓం త్ర్యమ్బకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం,
ఉర్వారుక మివ బంధనాన్ మృత్యోర్ముక్షీయ మా2మృతాత్।
త్ర్యమ్బకం యజామహే సుగంధిం పతివేదనం,
ఉర్వారుకమివ బంధనాదితో ముక్షీయ మా ముతః॥ (యజు 3-60)

భక్తులు భగవంతుని తప్ప మరెవరిని ఉపాసించకూడదు. బాగా పండిన దోసపండు తనంతట తాను సమయమునకు తొడిమ నుండి వేరైపోతుంది. అప్పుడది మంచి స్వాదిష్టముగా ఉంటుంది. అట్లాగే మేము పూర్ణాయువును అనుభవించి శరీరమును స్వచ్ఛందముగా త్యజించి ముక్తిని పొందుదుముగాక! మోక్షప్రాప్తికై నిత్యము అనుష్ఠానమును చేయుదుము గాక! మేము నిరంతరం ఈశ్వరుని యందు వేదమునందు వేదోక్త ధర్మమునందు ముక్తి సాధనయందు శ్రద్ధ వహించెదము గాక!



## 4. పూర్ణాయువు మంత్రము

ఓం ఆయుర్ యజ్ఞేన కల్పతాం, ప్రాణో యజ్ఞేన కల్పతాం, చక్షుర్ యజ్ఞేన కల్పతాం,
శ్రోత్రం యజ్ఞేన కల్పతాం, వాక్ యజ్ఞేన కల్పతాం, మనో యజ్ఞేన కల్పతాం,
ఆత్మా యజ్ఞేన కల్పతాం, బ్రహ్మ యజ్ఞేన కల్పతాం, జ్యోతిర్ యజ్ఞేన కల్పతాం,
స్వర్ యజ్ఞేన కల్పతాం, పృష్ఠం యజ్ఞేన కల్పతాం, యజ్ఞో యజ్ఞేన కల్పతాం,
స్తోమశ్చ యజుశ్చ ఋక్చ సామచ బృహచ్చ రథంతరంచ స్వర్దేవా అగన్మామృతా
అభూమ ప్రజాపతేః ప్రజా అభూమ వేట్ స్వాహా॥ (యజు 18-20)

పరమాత్ముడు సమస్త జగత్తులో వ్యాపకుడై ఉన్నాడు. అతడే విష్ణువు. మానవులందరూ తమ పూర్ణ ఆయువును పరమాత్మను సేవించేందుకు, ఆయన ఆజ్ఞలను పాలించేందుకు వినియోగించాలి. మన జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, ఆత్మ అన్నింటిని యజ్ఞమయం చేసుకోవాలి. అంటే పవిత్రంగా ఉంచుకోవాలి. చతుర్వేదాలను చదివి పురుషార్థాలను సాధించాలి.

## 5. పరమేశ్వర సగుణ నిర్గుణోపాసన మంత్రము

ఓం సపర్యగాచ్ఛుక్ర మకాయ మవ్రణం అస్నా విరగ్ం
శుద్ధ మపాపవిద్ధం కవిర్ మనీషీ పరిభూః స్వయంభూః
యాథాతథ్యతో2ర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యః సమాభ్యః స్వాహా॥
ఇదం పరమాత్మ నే ఇదం న మమ॥ (యజుర్వేదము 40-8)

ఈ వేదమంత్రము పరమేశ్వరుని స్వరూపాన్ని స్పష్టంగా వర్ణిస్తుంది. పరమేశ్వరుడు సర్వత్ర పరిపూర్ణుడు, శక్తిశాలి, శరీరహితుడు అనగా నిరాకారుడు. శరీరం లేనందున వ్రణములు, నాడీ బంధనాదులుండవు. శుద్ధుడు, పవిత్రుడు, పాపములాయన కంటవు. ఆయన కవి, జ్ఞాని, సర్వజ్ఞుడు. మన మనస్సులలోని ప్రతి ఆలోచనలు ఆయనకు తెలుసు. ఆయన "పరిభూః!" అనగా అన్నివైపుల వుండి అన్నింటిపై తన అధికారం కలిగివుంటారు. తన స్వయంసత్తాతో వుంటాడు. ఈ సృష్టినంతా చేసి జీవులకు శరీరాదులనిస్తాడు. అనాదికాలం నుండి వస్తున్న జీవులకు వాటివాటి కర్మానుసారం ఫలములనిచ్చే న్యాయాధీశుడు. కనుక మనమాయన నీడలో వుండి ఆయన ఆజ్ఞానుసారం ఎల్లప్పుడు ఉత్తమ కర్మలాచరిస్తూ సుఖశాంతులతో జీవించాలి.



### 6. గణపతి మంత్రము

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే,
ప్రియాణాం త్వా ప్రియపతిగ్ం హవామహే।
నిధీనాం త్వా నిధిపతిగ్ం హవామహే వసోమమ,
అహమజాని గర్భధ మా త్వమజాసి గర్భధమ్॥ (యజు 23-19)

సమస్త గణములకు పాలకుడవైన ఓ పరమాత్మా! మేము నిన్ను హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాము. భక్తులకు ప్రియమైన దేవా! నిన్ను మేము శ్రద్ధతో స్తుతించుచున్నాము. విద్యాజ్ఞానాదులను ఇచ్చి రక్షించు సర్వేశ్వరా! నిన్ను మేము భజించుచున్నాము. సకల ప్రాణులను, ప్రకృతిని గర్భమున ధరించిన జగదీశ్వరా! సమస్త మానవులు నిన్ను ఉపాసింతురు గాక!

### 7. గురుశిష్య బంధ మంత్రము

ఓం సహనావవతు సహనౌ,
భునక్తు సహవీర్యం కరవావహై ।
తేజస్వి నావధీతమస్తు,
మా విద్విషావహై॥ (తైత్తిరీయ ఆరణ్యకం)

హే జ్ఞాన స్వరూప పరమాత్మా! గురుశిష్యులమైన మమ్ములను పాలించి, పోషించి, రక్షించెదవు గాక! మేమిరువురము పురుషార్థపరులగునట్లు అనుగ్రహింతువు గాక! మేము జ్ఞానాన్ని పొంది భూమండలంపై నలుదిశలా జ్ఞాన ప్రకాశాన్ని అందించెదముగాక! మాలో పరస్పరం ద్వేష భావాలు లేకుండుగాక!

### 8. మేధా బుద్ధి మంత్రము

ఓం యాం మేధాం దేవగణాః
పితరశ్చోపాసతే।
తయా మా మద్య మేధయాగ్నే,
మేధావినం కురు స్వాహా॥ (యజుర్వేదం 32-14)

హే జ్ఞాన స్వరూప పరమాత్మా! మా పూర్వులు, విద్వాంసులు ఏ మేధస్సు కొరకై నిన్ను ఉపాసించిరో, ఆ మేధా శక్తిని మాకు ప్రసాదించి మమ్ములను మేధావంతులుగా చేయుము.

## 9. పరమేశ్వర సంకీర్తనా మంత్రము

**త మీశ్వరాణాం పరమం మహేశ్వరం,**
**తం దేవతానాం పరమం చ దైవతమ్।**
**పతిం పతీనాం పరమం పరస్తాత్,**
**విదామ దేవం భువనేశ మీ డ్యమ్॥**

(శ్వేతాశ్వతరోపనిషత్ 6-7)

పరమేశ్వరుడు రాజులకు గొప్పరాజు. అగ్న్యాది దేవతలకు దీప్తి నొసంగు పరమదేవత. ప్రజాపతులకు పాలకుడు. సూక్ష్మ ప్రకృతికి - పరమాణ్వాదులకంటే సూక్ష్మమై సమస్త భువనములను శాసించు సర్వస్తుత్యుడగు ఆ దేవుని తెలుసుకొందము. ఇందు పరమేశ్వరుడు సర్వాతిశయుడనియు, అతనినే తెలుసుకొనవలెనని స్పష్టం చేయబడింది.

## 10. సన్మార్గ మంత్రము

**అసతో మా సద్గమయ।**
**తమసో మా జ్యోతిర్ గమయ।**
**మృత్యోర్ మా అమృతం గమయ॥** (శతపథబ్రాహ్మణం)

హే పరమాత్మా! అసత్య మార్గము నుండి మమ్ములను వేరుచేసి సన్మార్గమున నడిపించుము.

అజ్ఞానమనే అంధకారం నుండి తొలగించి జ్ఞానమనే ప్రకాశమార్గమున పయనింప చేయుము.

జన్మ-మరణ దుఃఖము నుండి విడిపించి మోక్షానందమును కలుగుజేయుము.

## 11. ప్రణవ మంత్రము

సర్వేవేదా యత్ పదమామనంతి,
తపాంసి సర్వాణి చ యద్ వదంతి।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి,
తత్తేపదగ్ం సంగ్రహేణ బ్రవీమి ఓ౩మ్ ఇత్యేతత్॥

(కఠోపనిషత్తు)

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదములను నాలుగు వేదములు 'ఓ౩మ్' నామంతో పిలువబడే పరమేశ్వరునే పొందవలయునని బోధిస్తున్నవి. యోగులు నిరంతరము ఓ౩మ్ నామమునే ధ్యానింతురు.

తస్యవాచకః ప్రణవః (పతంజలి యోగశాస్త్రం 1-27)

పరమేశ్వరుని అత్యుత్తమ నామము ఓంకారము

తద్‌జపః తద్ అర్థ భావనమ్। (పతంజలియోగశాస్త్రం 1-28)

అవతీ ఇతి ఓ౩మ్। ఓ౩మ్ అనగా రక్షకుడు. ఓ౩మ్ నామమును అర్థసహితంగా జపించాలి. యోగులు 'ఓ౩మ్' నామమును నిరంతరము జపింతురు. అట్టి పరమేశ్వరుని సాక్షాత్కారమునకై, మానవులు బ్రహ్మచర్య వ్రతమును పాలించాలని, కఠోపనిషత్తులో యమాచార్యుడు, బ్రహ్మచారి నచికేతునకు ఉపదేశించుచున్నాడు.

## 12. ప్రణవ మహిమా మంత్రము

ఓ౩మ్ ఇత్యేతద్ అక్షరం ఇదగ్ం సర్వం, తస్యోప వ్యాఖ్యానమ్॥
భూతం భవద్ భవిష్యదితి సర్వమ్ ఓంకార ఏవ
యచ్చాన్యత్ త్రికాలాతీతం తదపి ఓంకార ఏవ॥

(మాండుక్యోపనిషత్తు)

ఈ సకల చరాచర జగత్తు (సృష్టి) నందంతటా నాశరహితుడైన పరమేశ్వర తత్త్వము ఓ౩మ్ వ్యాపించి ఉంది. భూత, వర్తమాన, భవిష్యత్తులనబడు త్రికాలములతో కూడిన ఈ సృష్టికి కూడా ఆధారము 'ఓ౩మ్'. ఈ త్రికాలములచే బంధింపబడని

పరతత్త్వము కూడా 'ఓ3మ్' అని మాండూక్యోపనిషత్తులో ఋషి శిష్యులకు ఉపదేశించుచున్నాడు.

ఇట్టి సర్వోత్తమమైన పరమేశ్వరుని 'ఓ3మ్' నామమును జపించిన మానవులందరు తరించెదరు.

## 13. శాంతి ప్రార్థనా మంత్రము

**ఓం పృథివీ శాంతి, రన్త రిక్షగ్ం శాంతిః।**
**ద్యౌః శాంతి రాపః శాంతిః ఓషధయః శాంతిః।**
**వనస్పతయః శాంతి ర్విశ్వే మే దేవాః శాంతిః।**
**సర్వే మే దేవాః శాంతిః శాంతిః శాంతిః శాంతిభిః।**
**తాభిః శాంతిభిః, సర్వ శాంతిభిః, శమయా మోహం।**
**యదిహఘోరం, యదిహక్రూరం, యదిహపాపం।**
**తచ్ఛాన్తం, తచ్ఛివం సర్వమేవ శమస్తు నః।।** (అథర్వవేదం 19-9-14)

శాంతిమయుడైన పరమేశ్వరుని మేము శాంతి కొరకు ప్రార్థించు చున్నాము. ఈ పృథివి, అంతరిక్ష ద్యులోకములు సర్వదా మాకు శాంతిదాయకములు అగును గాక! ఓషధులు, వనస్పతులు, పర్వతములు, నదులు, సముద్రములు సర్వదా మాకు శాంతినిచ్చి మమ్ములను రక్షించుగాక! ఈ బ్రహ్మాండములోని సమస్త జడచేతన పదార్థములు నిరంతరము మాకు శాంతిదాయకములు అగును గాక! మోక్ష ప్రదాతయైన పరమేశ్వరుడు మాకు శాంతినిచ్చి మమ్ములను శాంతపరచుగాక! ఆ పరమాత్ముని దివ్యమైన వేదజ్ఞానము కూడా మాకు శాంతినిచ్చి మమ్ములను శాంతిమార్గమున నడిపించుగాక! నిర్మలము స్వచ్ఛమైన శాంతికూడా మాకు శాంతినిచ్చుగాక! మాలోని క్రూరమైన పాపకర్మలను పరమేశ్వరుడు తొలగించుగాక! మేము నిరంతరము శుభంకరమైన దివ్యమార్గమును అనుసరించునట్లు ఆ పరాత్పరుడు మమ్ములను అనుగ్రహించుగాక!

## 14. భోజనసమయమున పఠించు మంత్రము

ఓ3మ్ అన్నపతే! అన్నస్య నో ధేహి,
అనమీవస్య శుష్మిణః।
ప్రప్రదాతారం తారిష,
ఊర్జం నో ధేహి ద్విపదే చతుష్పదే ॥ (యజుర్వేదం 11-83)

హే అన్నపతే! పరమేశ్వర! మాకు పుష్టికరము, ఆరోగ్యప్రదమైన ఆహారమునిమ్ము. అన్నదాతను వర్ధిల్లజేయుము. అన్నము ద్వారా సకలజీవులకు బలమునిమ్ము.

*పరమేశ్వరుడు ఒక్కడు. అతనికి సమానుడు కానీ అధికుడు కానీ మరియొకడు లేడు. అతడు తన వేద జ్ఞానాన్ని పురస్కరించుకొని సమస్త జగత్తును రచించాడు. సృష్టి కార్యం చేయడంలో అతనికెట్టి సహకారం అవసరం లేదు. వేదాల ఆధారంగా జీవులకు కల్యాణకరములైన యజ్ఞాది క్రియలను బోధించినవాడు. అందుకే యోగులు ఆ భగవంతుని ఎంతగానో స్తుతిస్తారు. అతడంతట వ్యాపించి ఉన్నాడు. అందువలననే వేదం ఆ పరమాత్ముని విభుడని అంటుంది. అతడు అనంతుడు. అతనిని మించిన దేవత మరొకటి లేదు. అతడు సర్వజ్ఞుడు. మేధావులు, విప్రులు, నిరంతరం ఆ పరమాత్ముని సాక్షాత్కారం కోరి తమ మనస్సులను రూపరసాది బాహ్య విషయాల నుండి మరలించి మనః సృష్టికి కారణమైన బుద్ధియందు లీనం చేస్తారు. ఆ బుద్ధితో ఆత్మ విచారణ చేస్తారు. క్రమంగా ఈశ్వర సాక్షాత్కారానికి యోగ్యులవుతారు. అందుకే వారు పరమాత్ముని విశేషంగా, ఘనంగా కీర్తించి స్తుతిస్తారు.*

*- శ్వేతాశ్వతరోపనిషత్తు*



## అథ తృతీయః పితృయజ్ఞః

### పితరుల పరిగణన

### తృతీయ పితృ యజ్ఞము - వ్యాఖ్యానము

పితృయజ్ఞము - తర్పణము, శ్రాద్ధమునని రెండు విధములు. విద్వాంసులను ఋషులను, పితరులను - అంటే జీవించివున్న తల్లి తండ్రులు తాతయ్యలు, నాయనమ్మలు మొదలైన పెద్దలను తృప్తి పరచుట తర్పణమనబడును. వారిని శ్రద్ధతో సేవించుట శ్రాద్ధమనబడును. ఈ రెండు విధములైన కర్మలు జీవించి వున్న విద్వాంసులు పెద్దలకే చేయవలయును. మరణించినవారికి శ్రాద్ధ, తర్పణములు సంభవము కాదు. మరణించిన వారికి జీవించి ఉన్నవారితో ఎట్టి సంబంధముండదు. సంబంధము లేకుండా చేసే క్రియల వలన ఎట్టి ప్రయోజనము ఉండదు. మరణించిన వారినుద్దేశించి చేసే క్రియలు వారికి చెందవు. అందువలన అవి శాస్త్ర రీత్యా వ్యర్థములు. జీవించియున్న దేవతలు - విద్వాంసులు, ఋషులు, పితరులు - పెద్దలు వీరినే సేవించి సత్కరింపవలయును ఇదే పితృయజ్ఞము.

**సోమసదః అగ్నిష్వాత్తాః బర్హిషదః సోమపాః**
**హవిర్భుజః ఆజ్యపాః సుకాలినః యమరాజాశ్చేతి.**

(సోమసదులు) ఈశ్వరుని యందు నిష్ఠగలవారు. సోమయాగమున నిపుణులు. సౌమ్యగుణములు కలవారు. (అగ్నిష్వాత్తులు) ఈశ్వరుని బాగుగ గ్రహించినవారు. లేక అగ్నిగుణముల నెఱుగుటచే యానయంత్రములను రచింపవలయు పదార్థవిద్య బాగుగనెఱిగినవారు. (బర్హిషదులు) బ్రహ్మాయందో లేక

శాంతి – ఆది ఉత్తమగుణములందో వర్తిల్లువారు. (సోమపులు) యజ్ఞమున సుత్తప్ప ఓషధీరసమును పానము చేయువారు. (హవిర్భుజులు) యజ్ఞముచే శోధింపబడిన వర్షజలాదుల ననుభవించు స్వభావము గల విద్వాంసులు, (సుకాలులు) ఈశ్వర జ్ఞాన ప్రాప్తితో సుఖముగా కాలము గడపువారు. (యమరాజులు) పక్షపాతమును విడిచి న్యాయవ్యవస్థ నొనరించువారు.

ఇట్లు జీవించియున్న విద్వాంసులకు, ఋషులకు, పితృపితామహాదులకు సుఖము కలిగించు నిమిత్తము ప్రీతితో చేయు సేవ తర్పణమనియు శ్రద్ధతో చేయు సేవ శ్రాద్ధమనియు చెప్పబడును.

వసూన్ వదన్తి వై పిత్యాన్ రుద్రాంశ్చైవ పితామహాన్
ప్రపితామహాం శ్చాదిత్యాన్ శ్రుతి రేషా సనాతనీ. (మనుస్మృతి 3-284)

అను నిట్టి మన్వాది శ్లోకములును ప్రమాణములు.

ఇతి పితృయజ్ఞః



గృహస్థాశ్రమం ఆదర్శవంతం కావాలని గృహంలోని సభ్యులు తమ ధర్మాన్ని విధులను సక్రమంగా నిర్వహించి సుఖశాంతులను పొందాలని పరమాత్ముడు ఉపదేశిస్తున్నాడు. –

సంతానం తండ్రి ఆజ్ఞలను పాలించాలి. తల్లి మనస్సు సంతోషపరచి ఆమెతో ప్రేమతో గౌరవంగా మెలగాలి. భార్య భర్తతోనూ, భర్త భార్యాతోనూ మధురంగా, ప్రియంగా, శాంతంగా మాట్లాడాలి. ఈ మాధుర్యాన్ని కుటుంబ సభ్యులంతా కలిసి అనుభవించాలి. తల్లిదండ్రులకు అనుకూలంగా సంతానం వర్తించాలి. పరివారమంతా ఏకవ్రతులై వుండాలి. – అధర్వవేదం



## అథ చతుర్థోభూతయజ్ఞః "బలివైశ్వదేవః"

### చతుర్థ భూతయజ్ఞము - వ్యాఖ్యానము

పాకము సిద్ధమైనప్పుడు, ఉప్పు, కారము, చింతపండు, నూనె అనునవి కలుపనట్టియు పాలు, నెయ్యి, చక్కెర కలిపినట్టియు అన్నాది పదార్థములతో పది ఆహుతుల నీ క్రింద మంత్రములను పఠించుచు అగ్నికుండమున గాని పాకాగ్నిలో గాని ప్రతినిత్యము వేయవలెను.

ఓం అగ్నయేస్వాహా ॥1॥ ఓం సోమాయ స్వాహా ॥2॥ ఓం అగ్ని షో మాభ్యాం స్వాహా ॥3॥ ఓం విశ్వేభ్యోదేవేభ్యః స్వాహా ॥4॥ ఓం ధన్వంతరయే స్వాహా ॥5॥ ఓం కుహ్వై స్వాహా ॥6॥ ఓం అనుమత్యై స్వాహా ॥7॥ ఓం ప్రజాపతయే స్వాహా ॥8॥ ఓం సహద్యావా పృథివీభ్యాం స్వాహా ॥6॥ ఓం స్విష్టకృతే స్వాహా ॥10॥

దీనికి పిమ్మట క్రింద వ్రాయబడిన బలిదాన మంత్రములతో ఒక్కొక్క గ్రాస (కొలత) ప్రమాణముగనో లేక వీలైనటులో పూర్వముదహరింప బడినట్లు ఉప్పు కారము మున్నగునవి కలువని 16 అన్నభాగములను ఒక పాత్రయందో పళ్ళెరము యందో పెట్టవలెను. అప్పుడే అక్కడి కొకానొక సన్యాసి వచ్చినచో, అన్నమును అతనికి భోజనార్థమివ్వదగును. అట్లు తటస్థించని పక్షమున వానినగ్నిలో వేయవలెను.

ఓం సానుగా యేంద్రాయ నమః ॥1॥ దీనిని తూర్పు దిక్కున

ఓం సానుగాయ యమాయ నమః ॥2॥ దక్షిణ దిక్కున

ఓం సానుగాయ వరుణాయ నమః ॥3॥ పశ్చిమమున

ఓం సానుగాయ సోమాయ నమః ॥4॥ ఉత్తరమున

ఓం మరుద్భ్యో నమః ॥5॥ ద్వారమున

ఓం అద్భ్యో నమః ॥6॥ జలస్థానమున

ఓం వనస్పతిభ్యో నమః ॥7॥ రోలు రోకలి, స్థానమున

ఓం శ్రియై నమః ॥8॥ ఈశాన్యమూలన

ఓం భద్రకాల్యైనమః ॥9॥ నైఋతిమూలన

ఓం బ్రహ్మాపతయే నమః ॥10॥ మధ్యన

ఓం వాస్తుపతయే నమః ॥11॥ మధ్యన

ఓం విశ్వేభ్యో దేవేభ్యో నమః ॥12॥ పైన

ఓం దివాచరేభ్యో భూతేభ్యో నమః ॥13॥ పైన

ఓం నక్తం చరేభ్యో భూతేభ్యో నమః ॥14॥ పైన

ఓం సర్వాత్మ భూతయే నమః ॥15॥ పృష్ఠమున (వెనుక)

ఓం పితృభ్యః స్వధాయిభ్యః స్వధానమః ॥16॥ దక్షిణమున

దీనికి పిమ్మట

శునాంచ పతితానాంచ శ్వపచాం పాపరోగిణామ్ ।

వాయసానాం కృమీణాంచ శనకైర్నిర్వ పేద్భువి ॥మనుస్మృతి 3-62॥

ఈ ప్రమాణముచే క్రింద నుదహరింబడిన "లవణాది మిశ్రిత" అన్నభాగములను భూమిపై పెట్టి, ఎవరి భాగములను, వారి వారికివ్వవలెను.

శ్వభ్యో నమః ॥1॥ కుక్కలకు

పతిత్యేభ్యో నమః ॥2॥ పతితులకు (ధర్మభ్రష్ఠులకు)

శ్వపక్భ్యో నమః ॥3॥ చండాలురకు

పాపరోగిభ్యో నమః ॥4॥ గ్రుడ్డి, కుంటి, మొండి మున్నగు వారలకు

వాయసేభ్యో నమః ॥5॥ కాకులకు

కృమిభ్యో నమః ॥6॥ చీమలు మున్నగు వానికి

ఉపర్యుక్త ప్రకరణమందలి "నమః" శబ్దమునకర్థము అన్నము అని తెలుసుకోవలయును.

ఇతి భూత యజ్ఞః



## అథ పంచమో అతిథి యజ్ఞః

### పంచమ అతిథి యజ్ఞము - వ్యాఖ్యానము

వేదము - పరోపకారి జితేంద్రియుడు ధర్మాత్ముడు సత్యవాది పరమాత్మునియందు అచంచలమైన భక్తి విశ్వాసములు కలవారు, నిత్యము సదుపదేశములను చేయుటకు సంచరించు పూర్ణ విద్వాంసుడైన సంన్యాసిని అతిథి అని సంబోధించినది. తిథివార నక్షత్రము నిర్ణయించక ఆకస్మికముగా వచ్చు సాధుసత్పురుషులను మన పూర్వులు అతిథులుగా లెక్కింతురు. గృహస్థుడు స్వయముగా అతిథిని సమీపించి వారిని శ్రద్ధతో ఆహ్వానించి ఉచితాసనముపై కూర్చుండబెట్టి వారిని ప్రసన్నులను చేయవలయును. వారికి శుద్ధమైన అన్న జలముల నిచ్చి సత్కరింపవలయును. తరువాత వారిని ధర్మోపదేశము చేయవలయునని నమ్రతా భావముతో కోరవలయును. ఆ ఉపదేశము ద్వారా గృహస్థులు సత్యాసత్య వివేచనమును పొంది జీవితమును చరితార్థము చేసుకోవలయును.

#### అతిథి సత్కారః

**తద్యస్యైవం విద్వాన్ వ్రాత్యోఽతిథిర్ గృహానాగచ్ఛేత్ ॥1॥**
**స్వయమేన మభ్యుపేత్య బ్రూయాద్, వ్రాత్య క్వాఽవాత్సీర్**
**వ్రాత్యోదకం, వ్రాత్య తర్పయన్తు, వ్రాత్య యథా తే ప్రియం**
**తథాఽస్తు, వ్రాత్య యథా తే వశస్తథాఽస్తు వ్రాత్య**
**యథా తే నికామ స్తథా స్త్వితి ॥2॥** (అథర్వ. 15-11-1)

అర్థము - (తద్య-) పరోపకారియు, జితేంద్రియుడును, ధర్మాత్ముడును, సత్యవాదియు, ఛలకపట రహితుడును, ఈశ్వర విశ్వాసియు, నిత్యము సంచరించు వాడును, పూర్ణ విద్వాంసుడును, నగు (వ్రాత్యోఽతిథిః) అతిథి అనగా నెవనికి

రాకపోకలకు తిథి నిర్ణయింపబడి యుండదో అట్టి సన్యాసి (గృహానాగ-) అకస్మాత్తుగా గృహమునకు వచ్చినపుడు (స్వయమే-) గృహస్థుడు స్వయముగా లేచి ఆ సంన్యాసిని సమీపించి (బ్రూయాత్) చెప్పవలసిన దేమన (వ్రాత్య) ఓ స్వామీ (క్వావాత్సీః) నిన్న తామెక్కడ నివసించగల్గితిరి? (వ్రాత్యోదకం) ఈ జలమును గైకొనుడు (వ్రాత్యతర్పయన్తు) మేము తమరిని ప్రేమపూర్వకముగా తృప్తినొందచేయుచున్నాము. (వ్రాత్యయథా-) తమరు ప్రసన్నులగునట్లే మేమొనర్తుము. (యథాతేవ-) తమరాజ్ఞాపించునట్లే మేము వర్తింతుము. (యథాతేని-) తమకభీష్టమైనట్లంత మేము చేయగలము అను నీ మృదు మధుర వాక్యముల జెప్పదగును.

ఇట్లు సత్యవాదియు, పరోపకారియు, ధర్మాత్ముడును, ఈశ్వర విశ్వాసియునగు సంన్యాసిని అన్నాది పదార్థములతో ప్రేమపూర్వకముగా సత్కరించి అతనితో సదుపదేశముల పొంది ఆనందించవలెను.

ఇతి పంచమో అతిథి యజ్ఞః

సత్యం సరళత ఉగ్రత తపస్సు - ధర్మపాలనలో కలిగే కష్టనష్టాలను సహించడం జ్ఞానం యజ్ఞ భావన ఈ గుణాలు స్వరాజ్యాన్ని సర్వదా రక్షిస్తాయి. స్వరాజ్యాన్ని స్వతంత్రంగా ఉంచేందుకు ప్రజలలో విశేషమైన గుణ సంపదలుండాలి. అప్పుడే స్వరాజ్యం స్వతంత్రమై తేజోవంతమై ఉజ్జ్వల కాంతితో ప్రకాశిస్తుంది. ఆ స్వరాజ్యం - ఆ వసుంధర పృథివి పరాక్రమ వంతులకు జనని అవుతుంది. స్వరాజ్య గౌరవాన్ని ఔన్నత్యం వైపు నడిపించాలంటే ప్రజల జీవనంలో సత్యముండాలి. శ్రద్ధ ధర్మశీలత అకుంఠిత దీక్షతో కార్యాలను సాధించాలి. పదార్థాల యథార్థ స్థితిని దర్శించాలి. ఉత్సాహం ధైర్యం సహనం త్యాగం తేజం ధర్మ నిష్ఠ వీనితోపాటు ఇంద్రియ నిగ్రహం కలిగి వుండాలి. - అధర్వణవేదం





# ద్వితీయ భాగము





## వైదిక ఈశ్వర భజనలు

### 1. యజ్ఞాంత ప్రార్థన

పూజనీయ ప్రభో హమారే భావ ఉజ్వల కీజియే।
ఛోడదేవే ఛల కపట్‌కో మానసిక బల దీజియే॥ 1

వేదకీ బోలే ఋచాయే సత్యకో ధారణ్ కరే
హర్షమే హెూ మగ్నసారే శోకసాగర సేతరే 2

అశ్వమేధాదిక్ రచాయే యజ్ఞ పర ఉపకార కో।
ధర్మమర్యాదా చలాకర్ లాభ్ దే సంసార కో॥ 3

నిత్య శ్రద్ధాభక్తి సే యజ్ఞాది హమ్ కరతే రహే।
రోగపీడిత విశ్వ కే సంతాప్ సబ్ హరతే రహే॥ 4

కామనా మిట్ జాయే మన్‌సే పాప అత్యాచార కీ
భావనాయే పూర్ణహెూవే యజ్ఞసే నరనారి కీ॥ 5

లాభకారీ హెూహవన్ హర్ జీవధారీ కే లియే।
వాయుజల సర్వత్ర హెూశుభగంధ కో ధారణ్ కియే॥ 6

స్వార్థ భావ్ మిటే హమారే ప్రేమపథ విస్తార హెూ।
ఇదన్న మమ కా సార్థక ప్రత్యేక మే వ్యవహార హెూ॥ 7

హాథ్ జోడ్ ఝుకాయె మస్తక్ వందనా హమ్ కర్ రహే।
నాథ్ కరుణా రూపకరుణా ఆప్‌కీ సబ్ పర్ రహే॥ 8



## 2. హిందుస్తాని భైరవి - రూపకము

విశ్వవిభుని ధ్యానము - విమల ముక్తి సోపానము
శాశ్వతసుఖ సంధానము - సకలఋషి విధానము ॥విశ్వ॥

కామక్రోధ లోభముల్ । కఠిన శత్రు జాలముల్
నేమముతో వానినడుప - నిజము చెదరు దురితముల్ ॥విశ్వ॥

చిత్తమం దసూయ పుట్టి - చిచ్చువోలె మండకుండ
ఉత్తమ శాంతస్వభావ - మూని యుండుము నిరతము ॥విశ్వ॥

మిత్రదృష్టితోడ ప్రాణి - మాత్రమెపుడు చూడుము
పాత్రవర్తన గల్గి జీవన - యాత్రసలుప గడగుము ॥విశ్వ॥

జగము నద్భుతంబుగా - సలిపి యేలు వానికంటే
జగతి నధికుడెవడులేడు - శరణ మతనిబొందుము ॥విశ్వ॥

## 3. హిందుస్తాని భైరవి - చాపు

నేడు మనమందరము కూడి పాడుదము పరమేశుని
ఈడు జగమున లేక యంతట - హెచ్చివెలిగెడు జ్యోతిని ॥నేడు॥

కందరమ్ముల మందిరమ్ముల - గహన పర్వత సీమల
సుందర ధ్వనితోడ యోగులు - స్తుతి యొనర్చెడు దేవుని ॥నేడు॥

చెట్టు చెట్టునన్ గాననంబున - జెలగు మధుర రుతంబుల
బిట్టలెవనిని పాడుచుండునో - ప్రీతిసాగరు నాతని ॥నేడు॥

నూతులందును చెఱువులందును - లోతు తెలియని జలధిలో
శీతజలమును ద్రావి కీర్తన - చేయు జలచర మాతని ॥నేడు॥

ఉత్సవంబుల నుల్లమలరగ - నువిద లెవ్వనిన్ బాడుచు
నుత్సహింతురొ యాదయామయు - నుత్తమోత్తమ పురుషుని ॥నేడు॥

శూరులును వీరాధివీరులు - శుద్ధహృదయాంబుజముల
సారె సారెకు నెవని దలతురో - సత్స్వరూపుబరేశుని ॥నేడు॥



## 4. ముఖారి - ఆదితాళము

నిఖిల జగములేలు తేడు నిన్ను నేల కుండునా?
నిఖిల మెఱుగు సర్వసాక్షి నిన్ను నెఱుగకుండునా? ||నిఖి||

నిఖిల జీవరక్షకుండు నిన్ను గావకుండునా?
నిఖిల భువన నాయకుండు నిన్ను నడపకుండునా? ||నిఖి||

నిఖిల మతని కప్పగింప నిన్ను మెచ్చకుండునా?
నిఖిల మతనిదనియె యనిన నీకు దుఃఖముండునా? ||నిఖి||

నిండి యంత టుండువాడు నీలో నుండకుండునా?
నిండు మదిని నతని గొల్వ నీకు లోపముండునా? ||నిఖి||

## 5. మధ్యమావతి - అదితాళము

మరి రాదుర యీా - మానుష జన్మము
పరమ పురుష కృప - వలననె కలిగెను ||మరి||

పరమేశుని వౌ - పరమాద్భుతముల
దరిసెన మొనరుప - దగు యంత్రంబిది ||మరి||

పరి పరి విధముల - బరులకు హితముల
దఱిని జేయు సా - ధనరాజమ్మిది ||మరి||

ఘన సద్గుణమణి - గణము గడింపగ
మనకు లభించిన - మహిత ధనమ్మిది ||మరి||

దేవుని జేర్పగ - జీవుని గొని చను
దేవదత్త మౌ - దివ్యరథం బిది ||మరి||

కాని దీనిజెడు - కార్యము లందిడు
వాని జన్మ మిల - వ్యర్థము వ్యర్థము ||మరి||

## 6. కమాచ్ - చాపుతాళము

కొనియాడదరమే నిన్ను - గువలయ వినుత।
కొనియాడ దరమే నిన్ను ॥కొని॥

దినకర శశి తార - గణముల వెలిగించు
ఘనతేజమును జూపు - కాంతిమంతుడ వీవు ॥కొని॥

బొంగరమ్ముల మాడ్కి - భూమ్యాది గ్రహముల
వింగి గిరగిరద్రిప్పు - నేర్పుకాడవు నీవు ॥కొని॥

ఒండొంటి ఢీ కొన - కుండ లోకముల ను
ద్దండ రీతిని నడపు - చండశాసనుడీవు ॥కొని॥

స్తుత్యమౌ నీ సృష్టి - సుందరమ్ముగ జేసి
యత్యద్భుతము జూపు - నైంద్రజాలుడ వీవు ॥కొని॥

పాఠశాలగ జగతి - బహువిధములజేసి
పాఠములను నేర్పు - పరమగురుడవు నీవు ॥కొని॥

## 7. కల్యాణి - ఆదితాళము

దినమది సుదినము కాదా (ప్రభు) దినమది సుదినము కాదా।
కనుగొని నిను మది - గానము చేసెడి ॥దిన॥

ఘనులగు నీ భక్త - జనములగూడి
మునినుత నినుగూర్చి - ముచ్చట లాడెదు ॥దిన॥

కనికర మెదలో - గరగి పొంగగా
ననదల కష్టము - లన్నియు దీర్చెడు ॥దిన॥

ధీరత నీ యాజ్ఞ - దీరిచి పోల్చెదు
వీరుల చరితము - విని హర్షించెదు ॥దిన॥

కళలదేరి స - త్కార్యము లొనరిచి
విలసిలు బుధులను - వేడ్కమన్నించెదు ॥దిన॥

నీదయ గల్గిన - నిఖిల బంధువుల
నాదరించి ముద - మందుచు నుండెదు ॥దిన॥

## 8. ఆఠాణా - చాపు

బుద్ధిపై పొరలీయరా - భువనేశ్వరా । బుద్ధిపై పొరలీయరా,
శుద్ధమగు నీ సత్స్వరూపము - చూచి చూచి కృతార్థులగుదుము
శ్రద్ధతో నీ సేవ లొనరిచి - శాశ్వతానందమ్ము గాంతుము॥ ॥బుద్ధి॥

భక్తి భిక్షము బెట్టరా - ప్రాణేశ్వరా । భక్తి భిక్షము బెట్టరా
శక్తిమీరగ బాపచయముల - జక్కగా జెండాడి వైతుము।
రక్తితో మా హృత్పురంబును - రాజధానిగ నీకు నిత్తుము॥ ॥భక్తి॥

దయను మాపై గురియరా - దయాకరా। దయను మాపై గురియరా,
దయను మాపై నీవు గురిసిన - దాపములు చల్లాటీ పోవును।
రయముగా హృత్క్షేత్రముల స - ద్రమ్యగుణముల పంట పండును॥ ॥దయ॥

ఐకమత్యము గూర్పరా - అఖిలాధార । ఐకమత్యము గూర్పరా
లోకమంతయు నీ కుటుంబము - లోనిదే యని తెలిసి మెలగుచు।
నీ కటాక్షము చేత వర్ధిలి - నిఖిలసుఖముల బడయు చుందుము॥ ॥ఐక॥

## 9. జంఝూటి - ఆది

వదలి కుమార్గము వరమార్గంబున - వర్తిలు చుండవె యో మనసా।
సదమల భక్తిని స్వామిని గొలుచుచు - సౌఖ్యము లందవె యో మనసా॥
పరుల సుఖమునే పాటించుచు భువి - పనులొనరింపవె యో మనసా॥
దురితదావాగ్నిని దూకుచు దారుణ - దుఃఖము లందకె యో మనసా॥ ॥వద॥

సత్యమె సర్వశ్రేయస్కరమని - సతత మెఱుంగవె యో మనసా।
సత్యవ్రతమును సలిపెడు నప్పుడె - శౌర్యము జూపవె యో మనసా ॥వద॥

న్యాయమె స్వర్గప్రాయము జగతిని - నమ్ముము ధృఢముగ నో మనసా
న్యాయము దప్పిన నరకంబుగ భువి - నాడే మాఱునె యో మనసా ॥వద॥

సుగుణ రత్నముల సొంపుగ దాలిచి - శోభిలుచుండవె యో మనసా।
అగణిత గుణరత్నాకరుడగు పర - మాత్మయె శరణము విను మనసా ॥వద॥

## 10. బేహాగ్ - ఆదితాళము

నీ నామమె యెంతో రుచిరా - నిఖిల సజ్జనగోచరా।
మానసమున కింపునింపు - మహిత వీణారవమురా॥ ॥నీ నామమె॥

మధురమైన నీనామె - మౌనులకు జపమురా।
అధమాధముల నుద్ధరింప - సంచిత సాధనమురా॥ ॥నీ నామమె॥

అఖిల పాపములను బాప - నదియె సిద్ధౌషధమురా।
సుఖము నాత్మబలమునిచ్చు - సురుచిరామృత రసమురా॥ ॥నీ నామమె॥

భవ్యధర్మరంగస్థిత - భక్త వీరకోటికి।
నవ్యయోత్సాహమ్ము గొల్పు - దివ్యభేరీ రవమురా॥ ॥నీ నామమె॥

## 11. బేహాగ్ - ఆదితాళము

పరమ పితా మా - ప్రార్థన వినురా
పాపములోబడ - నీయకురా
శరణాగత ర - క్షకుడని నిన్నే
శరణు జొచ్చితిమి - విడువకురా ॥పరమ॥

పరులను మావలె - భావించెదు మది
బరమాత్మా మా - కొసగుమురా
నిరతము నంతట - నీ మహిమలగను
నిరుపమ విద్యను - నేర్పుమురా। ॥పరమ॥

నీ యాజ్ఞలనే - నెఱవేర్పగ మది
నిర్మల భక్తిని - నిలుపుమురా
న్యాయసత్యకరు - ణాలయ మాలో
నద్భుతనాట్యం - బాడుమురా। ॥పరమ॥

శాంతిధామ మా - స్వాంతమునందలి
చింతల నీవెగ - జిమ్ముమురా
అంతరంగ మను - నరవిందము నీ
కెంతయు బ్రీతి న - ర్పింతుమురా। ॥పరమ॥

## 12. నారాయణి - చాపు

కరుణామృతపూరమా - పరంధామ - కరుణామృత పూరమా,
శరణుజొచ్చినవారిపాలికి - నరయ సుందర పారిజాతమ।
పరమ సుగుణ సముద్రమా ముని - వరులకును నినుబొగడతరమా॥ ॥కరు॥

సర్వేశ్వరా శ్రీకరా - సర్వాధార - సర్వేశ్వరా శ్రీకరా,
సర్వదుర్గుణములకు లోబడి - గర్వమున గనుగాన్నకుండెడు।
దుర్వినీతులబట్టి దిద్దెడు - సర్వశక్తుడ వీవె దేవర॥ ॥సర్వే॥

న్యాయపాలన భూషణ - అన్యాయశోషణ - న్యాయపాలన భూషణ,
న్యాయమున వర్తించువారల - కీ యమేయ సుఖంబు లొసగుచు।
న్యాయమును బ్రకటించు సుజన - ధ్యేయ నిరుపమ పరమ పావన॥ ॥న్యాయ॥

సత్యవ్రతధారక - శాంతిప్రసారక - సత్యవ్రత ధారక,
నిత్యసుఖ ధర్మ ప్రచారక - నిరుపమానందైక కారక
సత్యదీక్షాచరణ పూరక - సాధుతాపత్రయ నివారక॥ ॥సత్య॥

## 13. మాయామాళవగౌళ - ఆదితాళము

ఏమని పిలుతును నిన్ను నే - నేమని పిలుతు నిన్ను
స్వామీ యందున - సఖుడా యందున
ప్రేమకు నెలవగు - ప్రియుడా యందున ॥ఏమని॥

తల్లీయందున - తండ్రీ యందున
యెల్లరబ్రోచెడు - నీశ్వర యందున ॥ఏమని॥

దివ్యసౌఖ్య మిడు - దేవా యందున
అవ్యయుడగు పర - మాత్మా యందున ॥ఏమని॥

భవరోగమహా - వైద్యా యందున
వివిధ జగద్గణ వేద్యా యందున ॥ఏమని॥

గురులకు నెల్లను - గురువా యందున
వరముల నిడుకల్ప - తరువా యందున ॥ఏమని॥

ఎంతయు భక్తుల - హృదయరంగముల
వింతగ వెలిగెడు - వెలుగా యందున ॥ఏమని॥

## 14. నరనారీమణులందరును స్మరియించుడి ! ఓమ్ నామమును (రఘుపతి రాఘవ రాజారామ్)

నరనారీమణులందరును, స్మరియించుడి।
ఓమ్ నామమును ॥స్మరియించుడి॥

ప్రాణాధారము రక్షకము, దుఃఖహరము సుఖదాయకము
ముక్తికి ఇదియే మూలమును ॥స్మరి॥

అతి సరళము అతి సుందరము, అతి మధురము అతి పావనము
అనగలుగును మూగవాడును ॥స్మరి॥

ఋషులూ మునులూ దేవతలు, జపియించిరి రాత్రింబవలు
తలచెను రాముడు కృష్ణుడును ॥స్మరి॥

తుమ్మెదలూ కల కోయిలలు సముద్రములూ జలపాతములు
ఈ నామమునే పాడేను ॥స్మరి॥

కన్నులు మూసిన తెఱచినను, ఊపిరి పీల్చిన వదిలినను
కష్టములోనూ సుఖమునను ॥స్మరి॥

## 15. భగవత్ ప్రార్థన

ఆనందరూప భగవన్ - కిస్ భాంతి తుమ్ కో పాంఊ
తేరే సమీప్ స్వామిన్ । మై కిస్ తరహా సే ఆ ఊ॥

అనుపమ్ పరమ్ ఛబీలె-బినరంగ్ రస్ రసీలె,
కంటక్ సఖా హై ఫుల్వా, క్యా తేరే సర్ ఛడాఊ॥

సుఖ్ మూలముక్త్ రూపమ్, మంగల్‌కుశల్ స్వరూపమ్,
ఘడియాల్ శంఖ్ కో క్యా, సన్ముఖ్ తేరే బజాఊ॥

గంగా హై తేరీ దాసీ, సేవక్ హై ఇంద్ర్ తేరా,
తేరే శరీర్ పై క్యా దో చుల్లూ జల్ చఢాఊ॥

ఛోటేసే దాస్ తేరే, రవి-చంద్ర హై ఉపస్థిత్,
కరతేహై నిత్ ఉజాలా, ఘృత్-దీప క్యా జలాఊ॥

శ్రీ లక్ష్మీ హై తేరీ, నిశిదిన్ చరణ్‌కి చేరీ,
తాంబేకా ఏక్ పైసా, మై నాథ్ క్యా దిలాఊ॥

ఆగమ్ నిగమ్ సే లేకర్, మేధా సరస్వతీ తక్
గుణ్ తేర గారహే హై క్యా గాకె మై రిఝాఊ॥

కోటానుకోటి భూమి, ఉన్‌పర్ అసంఖ్యప్రాణి,
జగదీశ్ । అప్నా నంబర్ మైకౌన్‌సా గినాఊ॥

వినతీ "కిశోర" కీహై, నిశిదిన్ యహి దయామయ్,
హృదయ్‌మే లాహో తేరీ అంఖోమే మై సమా ఊ॥

## 16. గేయము

తేరే మన్ మే ఓం, తన్ మే ఓం రోమ్ రోమ్ మే ఓం రే.
ఓం సుమీరు లే ధ్యాన్ లగాలే, ఛోడ్ జగత్ కే కామ్ రే
బోలో ఓం, బోలో ఓం, బోలో ఓం, ఓం, ఓం...... ॥2॥ ॥తేరే మన్ మే॥

మాయా మే తూ, ఉలఝ్ ఉలఝ్ డర్ డర్ ధూల్ ఉడాయే,
అబ్ కర్ తా క్యోం మన్ భారీ జబ్, మాయా సాథ్ ఛుడాయే ॥2॥ ॥మాయమే॥

దిన్‌తో బీతా దౌడ్ మే, ఢల్ జాయే నా శామ్ రే ॥బోలో ఓం॥

తన్ కే భీతర్ పాంచ్ లుటేరే, డాల్ రహే డేరా,
కామ్ క్రోధ్ మద్ లోభ్ మోహమే, తుమ్ కో ఐసా ఘేరా ॥2॥ తన్ కే॥

భూల్ గయా తూ ఓమ్ రతన్, భూలా ధ్యాన్ కా కామ్ రే ॥బోలో ఓం॥

బచ్‌పన్ బీతా ఖేల్ ఖేల్ మే, భరీ జవానీ సోయా,
దేఖ్ బుఢాప సోచే అబ్ తూ, క్యా పాయా క్యా ఖోయా ॥2॥ బచ్‌పన్॥

దేర్ నహీ హై అబ్ భీ బందే, లేలే ఓమ్ కా నామ్ రే ॥బోలో ఓం॥

## 17. గేయము

హే ప్రభు హమ్ తుమ్ సే వరపావే। సకల జగత్ కో ఆర్య బనావే.....
॥2॥ హే ప్రభు॥

పహిలే సుఖ్ సంపత్తి ఫైలావే। ఆప్ బఢే తవ రాష్ట్ర బఢావే
.....॥2॥ హే ప్రభు॥

వైర విఘ్న కో మార్ భగావే। ప్రీతి రీతి కీ నీతి చలావే
.....॥2॥ హే ప్రభు॥

## 18. హారతి

ఓమ్ జయ జగదీశ హరే, ప్రభు ! జయ జగదీశ హరే
భక్తజనోం కే సంకట క్షణమే దూర్‌కరే
జో ధ్యావే, ఫలపావే, దుఃఖ వినశే మనకా
సుఖ సంపత్ ఘర్ ఆవే, కష్టమిటే తనకా ॥ఓ॥

మాతపితా తుమ్ మేరే, శరణ గహూ కిసకీ
తుమ్ బిన ఔర్ న కోఈ, ఆశ కరూ జిసకీ ॥ఓ॥

తుమ్ పూరణ పరమాత్మ తుమ్ అంతర్యామీ
పరబ్రహ్మ పరమేశ్వర, తుమ్‌సబ్‌కే స్వామీ ॥ఓ॥

తుమ్ కరుణా కే సాగర్, తుమ్ పాలనా కర్తా
మై సేవక తుమ్ స్వామీ, కృపా కరో భర్తా ॥ఓ॥

తుమ్ హెూ ఏక అగోచర్, సబ్‌కే ప్రాణపతి
కిస్ విధ్ మిలూ దయామయ్, తుమ్ కో మై సుమతీ ॥ఓ॥

దీనబంధు దుఖ్ హర్తా తుమ్ రక్షక మేరే
కరుణా హస్త బఢాఓ, శరణ పడా తేరే ॥ఓ॥

విషయ వికార మిటావో పాపహరో దేవా
శ్రద్ధా భక్తి బఢావో సంతనకీ సేవా ॥ఓ॥

తన్ మన్ ధన్, సబ్ కుచ్ హై తేరా
తేరా తుఝ్‌కో అర్పణ్, క్యా లాగే మేరా ॥ఓ॥



## 19. వైదిక ధ్వజ గీతము

జయతి ఓం ధ్వజ వ్యోమ విహారీ, విశ్వప్రేమ ప్రతిమా అతి ప్యారీ
॥జయతి॥

సత్య సుధా బర్‌సానే వాలా, స్నేహలతా సర్‌సానే వాలా
సౌమ్య సుమన్ వికసానే వాలా, విశ్వవిమోహక్ భవ భయ హారీ
॥జయతి॥

ఇస్ కే నీచే బఢే అభయ్ మన్, సత్‌పథ్ పర్ సబ్ ధర్మ ధురీ జన్
వైదిక్ రవి కా హెూ శుభ్ ఉదయన్, ఆలోకిత్ హెూవే దిశసారీ
॥జయతి॥

ఇస్ సే సారే క్లేశ్ శమన్ హెూ, దుర్మతి దానవ ద్వేష్ దమన్ హెూ,
అతి ఉజ్వల్ అతిపావన్ మన్‌హెూ, ప్రేమ తరంగ్ బహే సుఖ్ కారీ
॥జయతి॥

ఇసీ ధ్వజా కే నీచే ఆకర్, ఊంచ్ నీచ్ కా భేద్ భులాకర్
మిలే విశ్వముద మంగల్ గాకర్, పంథాయీ పాఖండ్ బి సారీ
॥జయతి॥

ఇసీ ధ్వజా కో లేకర్‌కర్ మే, భర్ దే వేద్ జ్ఞాన్ ఘర్–ఘర్ మే
సుభగ్ శాంతి ఫైలే జగ్ భర్ మే, మిటే అవిద్యాకే అంధియారీ ॥జయతి॥

విశ్వ ప్రేమ కా పాఠ్ పఢావే, సత్య అహింసాకో అప్ నావే
జగమే జీవన్ జ్యోతి జగావే, త్యాగ్ పూర్ణ హెూ వృత్తి హమారీ
॥జయతి॥

ఆర్య జాతి కా సుయశ్ అక్షయ్ హెూ, ఆర్య ధ్వజా కీ అవిచల్ జయహెూ
ఆర్య జనోంకా ధ్రువ్ నిశ్చయ్ హెూ, ఆర్య బనావే వసుధా సారీ
॥జయతి॥



## 20. వైదిక ధ్వజ గీతా

దోధూయతాం వైదిక పతాకా విశ్వ జయనీ భారతే
సంజాయతాం ఘోషః శ్రుతీనాం పావనే భువి భారతే.... భారతే (దోధూ)

కోఽపి మాదీనో భవేత్ హీనో మలీనో మానవః
సర్వేజనాః సుఖినోభవేయుః మానభూమౌ భారతే .... భారతే (దోధూ)

ఆయన్తు మునయః పూర్వజాః దేశం సభాజియితుం పునః
సంపద్యతాం గురుతాం పునః విశ్వస్య భవ్యే భారతే.... భారతే (దోధూ)

ప్రాక్తనా వర్ణవ్యవస్థా చాశ్రమాణాం వర్తనమ్
దీవ్యతాత్ దైనం దినం ద్యుతిధామ దివ్యే భారతే .... భారతే (దోధూ)

వ్యాపృతాః సర్వే భవేయుః దేశ నిర్మాణే నవే
జీవతాత్ గణతంత్ర రాజ్యం సర్వసుఖదం భారతే .... భారతే (దోధూ)

హే పరమాత్మా! నీవే మాకు జీవనాన్ని ప్రసాదించిన వాడవు. మా శరీరాలను రక్షించేవాడవు నీవే. నా దేహంలోని లోపాలను తొలగించి పరిపూర్ణమైన ఆరోగ్యాన్ని ఆనందాన్ని అందించి నన్ను సన్మార్గంలో నడిపించమని వేద భగవానుని ప్రతినిత్యం మనం కోరుకోవాలి. ప్రతి నిత్యం శుద్ధమైన భోజనం సాత్వికపరమైన ఆలోచనలను కలిగించే నేయి, ధాన్యాలతో సంయుక్తమై శక్తినిచ్చే పదార్థాలను సేవించాలని వేదం ప్రబోధిస్తుంది.

- యజుర్వేదం



# ప్రణవ స్తోత్రమ్

(రఘుపతి రాఘవరాజారాం... అనే బాణీలో పాడుకోవచ్చును)

1. **అనంత గుణగణ భూషిత** ఓ3మ్
(పరమేశ్వరుడు అనంత గుణములతో అలంకరింపబడినవాడు)

2. **శుద్ధబ్రహ్మ పరాత్పర** ఓ3మ్
(శుద్ధుడు, అందరికంటె గొప్పవాడు. పెద్దవాడు)

3. **సబల బ్రహ్మ సునామక** ఓ3మ్
(బలవంతుడు, బ్రహ్మయను సుందర నామములు కలవాడు)

4. **కాలాత్మక పరమేశ్వర** ఓ3మ్
(కాలమును నియమించువాడు. గొప్ప ఐశ్వర్యవంతుడు)

5. **ప్రళయానంతర సుస్థిత** ఓ3మ్
(ప్రళయంలోను తరువాత ఉండువాడు)

6. **ఈక్షిత సృష్టి విధాయక** ఓ3మ్
(కనబడుచున్న ఈ సృష్టిని చేయువాడు)

7. **వ్యాపక యజ్ఞ ప్రసారక** ఓ3మ్
(సృష్టియను యజ్ఞమును అంతటా విస్తరింపజేయువాడు)

8. **లోకాఖిల గతిదాయక** ఓ3మ్
(లోకాలన్నింటిని నడుపువాడు)

9. **జగన్నియంతా పాలక** ఓ3మ్
(జగత్తును నియమముగా పాలించువాడు)

10. **జనతా దుఃఖ ప్రభంజక** ఓ3మ్
(ప్రజల దుఃఖములను తొలగించువాడు)

11. భక్తప్రియ సుఖదాయక ఓ3మ్
(భక్తులను ప్రేమించి సుఖముల నిచ్చువాడు)
12. సూర్యాదిక ద్యుతి ధారక ఓ3మ్
(సూర్యాది నక్షత్రములకు ప్రకాశము నిచ్చువాడు)
13. పరమసహాయక ప్రియవర ఓ3మ్
(గొప్ప సహాయకుడు. ప్రియుడు, శ్రేష్ఠుడు)
14. నిత్యతృప్త సర్వాశ్రయ ఓ3మ్
(జీవులను తృప్తిపరిచే సృష్టికి ఆశ్రయము)
అనంత గుణ గణ భూషిత ఓ3మ్
శుద్ధబ్రహ్మ పరాత్పర ఓ3మ్
15. జ్ఞానరూప సత్ప్రేరక ఓ3మ్
(సత్యజ్ఞానమును ప్రేరేపించువాడు)
16. సకల ద్రవ్య వ్యాపక ఓ3మ్
(సృష్టిలోని పదార్థాలన్నింటిలో వ్యాపించియున్నవాడు)
17. శ్రోత్రాదీంద్రియ శక్తిద ఓ3మ్
(జ్ఞాన కర్మేంద్రియాలకు శక్తినిచ్చువాడు)
18. కర్మాశ్రిత ఫలదాయక ఓ3మ్
(జీవులు చేయు కర్మలకు ఫలము నిచ్చువాడు)
19. అద్భుత తేజో బలయుత ఓ3మ్
(అద్భుతమైన తేజస్సు బలములు కలవాడు)
20. శ్రేయఃప్రాప్తి సుసాధక ఓ3మ్
(మోక్షప్రాప్తికి సాధనము)
21. హర్షిత మతి సందాయక ఓ3మ్
(సుఖములనిచ్చు బుద్ధిని ప్రసాదించువాడు)

22. మాతృప్రేమ పరిపోషక ఓ3మ్
(తల్లివలె ప్రేమతో అందరిని పెంచువాడు)

23. స్నేహార్ద్రిత పితృపాలక ఓ3మ్
(స్నేహంతో దయతో తండ్రివలె పోషించువాడు

24. వ్యాహృతి లోక విభాజక ఓ3మ్
విస్తారమైన సృష్టిని లోకాలుగా విభజించువాడు)

25. సకల బుద్ధి సిద్ధిప్రద ఓ3మ్
(సకల జ్ఞానము నిచ్చువాడు)

26. వేద చతుష్టయ దాయక ఓ3మ్
(ఋగ్, యజుస్, సామ అథర్వ వేదాల నిచ్చువాడు)

అనంత గుణగణ భూషిత ఓ3మ్

శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్

27. అగ్న్యాదిక ఋషి పూజిత ఓ3మ్
(అగ్ని వాయు ఆదిత్య అంగిరసులను ఆది ఋషులచే పూజింపబడువాడు)

28. సాధన సాధ్య సముచ్చయ ఓ3మ్
(సాధ్యమునకు తగిన సాధనములను
సమకూర్చువాడు. (మోక్షమునకు-యోగమువంటివి)

29. ప్రాణదక్ష సందాయక ఓ3మ్
(జీవులకు ప్రాణముల నిచ్చువాడు)

30. ఇంద్ర బృహస్పతి నామక ఓ3మ్
(ఇంద్రుడు, బృహస్పతి మున్నగు పేర్లుకలవాడు)

31. ఋతు పరివర్తన కారణ ఓ3మ్
(వసంతాది ఆఋ ఋతువులను కల్పించువాడు)

32. ఋతుమూలక హితదాయక ఓ3మ్
(ఋతువుల ద్వారా జీవులకు మేలు చేయువాడు)

33. జ్ఞాన సూర్య విస్తారక ఓ3మ్
(జ్ఞానమనే సూర్యుని మానవులలో ప్రకాశింపజేయువాడు)

34. సుర సంపూజిత సురవర ఓ3మ్
(దేవతలు పూజించే శ్రేష్ఠుడు - ఆదిదేవుడు)

35. సత్సంకల్పప్రపూరక ఓ3మ్
(సత్యసంకల్పములను నెరవేర్చువాడు)

36. ధర్మాధర్మ సుశిక్షక ఓ3మ్
(ధర్మము - అధర్మములను వేదము ద్వారా బోధించువాడు)

37. జన్మరహిత జన్మప్రద ఓ3మ్
(తాను శరీరమును ధరించక జీవులకు శరీరముల నిచ్చువాడు)

38. దేవాదిక ఋణమోచక ఓ3మ్
(విద్వాంసులను త్రివిధ ఋణముల నుండి విడిపించువాడు)

అనంత గుణగణ భూషిత ఓ3మ్

శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్

39. క్లేశ విముక్త విశేషణ ఓ3మ్
(కష్టములు లేని విశేష పురుషుడు)

40. స్నాయు రహిత సుఖపూరక ఓ3మ్
(నాడీ బంధనములు లేనివాడు. జీవులలో సుఖమును నింపువాడు.)

41. దైహికరోగ నివారక ఓ3మ్
(దేహసంబంధమైన రోగాలను రాకుండా చేయువాడు)

42. తనుపాలక దీర్ఘాయుద ఓ3మ్
(శరీరాలను పోషించి దీర్ఘాయువు నిచ్చువాడు)

43. ఆత్మికబల సందాయక ఓ3మ్
(ఆత్మబలము నిచ్చువాడు)

44. మానవ లక్ష్య మహాశ్రయ ఓ3మ్
(మానవులకు లక్ష్యము (పొందవలసినవాడు)
మరియు గొప్ప ఆశ్రయము)
45. నిత్య నిరంజన నిరుపమ ఓ3మ్
(భగవంతుడు నిత్యుడు, నిరంజనుడు, నిరుపముడు)
46. భవభయ భంజన భేషజ ఓ3మ్
(ప్రపంచమునందలి భయమును నాశనమొనర్చే ఔషధము)
47. ఆర్తత్రాణ పరాయణ ఓ3మ్
(కష్టములలోనున్న మంచివారిని రక్షించువాడు)
48. అజ్ఞానాదిక రిపుహర ఓ3మ్
(అజ్ఞానము మున్నగు శత్రువులను హరించువాడు)
49. దారిద్ర్యాది వినాశక ఓ3మ్
(పురుషార్థపరులైన వారి దరిద్రమును పోగొట్టువాడు)
50. పరమైశ్వర్య సుదాయక ఓ3మ్
(తన ఐశ్వర్యాదులతో జీవులకు సుఖముల నిచ్చువాడు)
అనంత గుణగణ భూషిత ఓ3మ్
శుద్ధబ్రహ్మ పరాత్పర ఓ3మ్
51. సర్వానంద సుసాధక ఓ3మ్
(పూర్ణానందమును పొందుటకు సాధనం)
52. సామ్రాజ్యార్క ప్రసారక ఓ3మ్
(సామ్రాజ్య సూర్యుని విస్తరింపజేయువాడు)
53. విశ్వవినోదక విభువర ఓ3మ్
(విశ్వమును సకల సుఖములతో వినోదంగా
సృష్టించి వ్యాపించి యుండువాడు)

54. సద్బోధిత హృద్వర్ధక ఓ3మ్
(సత్యసంకల్పములను చేయు మనస్సును వృద్ధి చేయువాడు)
55. నిర్మల నాయక శర్మద ఓ3మ్
(మల రహితుడు. నాయకుడు. ఆనందం నిచ్చువాడు)
56. లోభాదిక రిపు నాశక ఓ3మ్
(లోభము మున్నగు శత్రువులను నాశనము చేయువాడు)
57. తేజఃప్రద తేజోమయ ఓ3మ్
(సూర్యాది నక్షత్రములకు జీవులకు పూర్ణ ప్రకాశము నిచ్చువాడు)
58. ఓజః ప్రద ఓజోమయ ఓ3మ్
(అనంత సామర్థ్యము కలిగియుండి పూర్ణ సామర్థ్యము నిచ్చువాడు)
59. శ్రద్ధాప్రద శ్రద్ధామయ ఓ3మ్
(అనంత శ్రద్ధతో జీవులలో శ్రద్ధను కలుగజేయువాడు)
60. రసవాహక సర్వేశ్వర ఓ3మ్
(పుష్పఫలాదులలో రసమును చేర్చుచు సృష్టి అంతా ఐశ్వర్యంగా కలవాడు)
61. దాన సృష్టి సంచాలక ఓ3మ్
(జగత్తును సృష్టించి జీవుల కొరకు దానమొనర్చి, చక్కగా నడుపువాడు)
62. రసభేదక సంవర్ధక ఓ3మ్
(వృక్షాదులలోని రసమును సూర్యాదుల ద్వారా పైకి ఆకర్షింప జేయుచు వృద్ధి చేయువాడు)
అనంత గుణగణ భూషిత ఓ3మ్
శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్
63. పాప నివారక మోక్షద ఓ3మ్
(పాపములు చేయకుండా నివారించి మోక్షము నిచ్చువాడు)
64. మృత్యురూప సంశోధక ఓ3మ్
(మరణము ద్వారా జీవులను ఉద్ధరించేవాడు)

65. చిత్రవిచిత్ర మహోతుథ ఓ3మ్

(సృష్టిలోని చిత్రవిచిత్రములన్నీ తెలిసినవాడు)

66. సత్యసనాతన ధర్మద ఓ3మ్

(సత్యము సనాతనమైన వేదధర్మము బోధించేవాడు)

67. హోమార్పిత హవిభేదక ఓ3మ్

(హోమంలో అర్పించిన ద్రవ్యముల ద్వారా సుగంధమును వెదజల్లువాడు)

68. సభ్యసభా ప్రతిభాప్రియ ఓ3మ్

(ప్రతిభావంతులైన సభ్యుల సభకు ప్రియుడు)

69. విస్తృత శాంతి విధాయక ఓ3మ్

(శాంతిని విస్తరింపజేయువాడు)

70. వరుణ ప్రజాపతి ప్రేరక ఓ3మ్

(వరుణుడు, ప్రజాపతి, ప్రేరణ నిచ్చువాడు)

71. స్థావర జంగమ రక్షక ఓ3మ్

(స్థావరములను (కదలనివి)

జంగమములను (కదులునవి) రక్షించువాడు)

72. విద్వజ్జన మతి ప్రేరక ఓ3మ్

(విద్వాంసుల బుద్ధిని వికసింపజేయువాడు)

73. విక్రమ విష్ణు విరాడసి ఓ3మ్

(విక్రముడు, విష్ణువు, విరాట్ మున్నగు నామములు కలవాడవు)

74. దాన రహిత నరనాశక ఓ3మ్

(దానము చేయని ప్రజలను నాశనము చేయువాడు)

అనంత గుణగణ భూషిత ఓ3మ్

శుద్ధబ్రహ్మ పరాత్పర ఓ3మ్

75. త్యాగయుక్త నర భద్రద ఓ3మ్

(త్యాగము చేయు నరులను రక్షించువాడు)

76. మన్యురూప మన్యుప్రద ఓ౩మ్
(దుష్టులు దుష్టకార్యములపైన క్రోధము కలిగి యుండి మానవులకు అట్టి మన్యువును ఇచ్చువాడు)

77. వీర్యరూప వీర్యప్రద ఓ౩మ్
(అనంత పరాక్రమముతో మానవులకు పూర్ణ పరాక్రమము నిచ్చువాడు)

78. సహనరూప సహదాయక ఓ౩మ్
(అనంత సహనముతో మానవులకు సహనము నిచ్చువాడు)

79. అచల రూప సంచాలక ఓ౩మ్
(తాను కదలక జగత్తునంతటిని నడిపించువాడు)

80. రుద్ర భీమ భయవాహక ఓ౩మ్
(రుద్రుడు, భీముడు, భయంకరుడు)

81. సజ్జన సమ్మత సౌఖ్యద ఓ౩మ్
(సజ్జనులకిష్టమైన సుఖముల నిచ్చువాడు)

82. వర్ణ చతుష్టయ స్థాపక ఓ౩మ్
(బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్ణములను ఏర్పరచినవాడు)

83. సర్వ న్యూన సంపూరక ఓ౩మ్
(సృష్టిలో ఏలోటు లేకుండా చేయువాడు)

84. విద్వేషాదిక భంజక ఓ౩మ్
(ద్వేషాదులను నాశనము చేయువాడు)

85. సర్వమిత్ర సంపాదక ఓ౩మ్
(అందరికీ మిత్రుడు)

86. సృష్టిస్థితి లయకారక ఓ౩మ్
(సృష్టిని చేసి పోషించి నాశనము చేయువాడు)

అనంత గుణగణ భూషిత ఓ౩మ్

శుద్ధబ్రహ్మ పరాత్పర ఓ౩మ్

87. క్షోభరహిత నభ నామక ఓ౩మ్
(దుఃఖము లేనివాడు, ఆకాశనామము కలవాడు)

88. మంగళ మూల మయోభవ ఓ౩మ్
(మంగళ కారుడు)

89. శంకరరూప మయస్కర ఓ౩మ్
(శంకరుడు, మయస్కరుడను పేర్లు కలవాడు)

90. సృష్టి మయా వసు రసవతి ఓ౩మ్
(నేను చేసిన ఈ సృష్టి ఐశ్వర్య, రసాదులతో కూడినది)

91. సత్పథ ధర్మ పురోహిత ఓ౩మ్
(ధార్మికులను సత్యమార్గములో నడిపించువాడు)

92. నాశ నివారక స్వస్తిద ఓ౩మ్
(నాశము నుండి తప్పించి శుభముల నిచ్చువాడు)

93. సకల యజ్ఞ స్వీకారక ఓ౩మ్
(శ్రేష్ఠ కర్మలన్నింటినీ అనుమతించువాడు)

94. ఉక్షిత రక్షక శిక్షక ఓ౩మ్
(శుభకర్మలాచరించువారిని రక్షించి, దుష్టులను శిక్షించువాడు)

95. విశ్వరూప విశ్వావసు ఓ౩మ్
(విశ్వమనెడు ఈ సమస్త ఐశ్వర్యమునకు యజమాని)

96. విశ్వమిత్ర వైశ్వానర ఓ౩మ్
(అందరికీ మిత్రుడు ఈశ్వరుడు)

97. పుణ్య పురాత మపూరుష ఓ౩మ్
(జీవునివలె పుణ్య పాపకర్మలు చేయడు)

98. పాహి నిరంతర పూషణ ఓ౩మ్
(సజ్జనులను ఎల్లప్పుడు రక్షించి పోషించువాడు)

అనంత గుణగణ భూషిత ఓ౩మ్

శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ౩మ్

99. పాహి ప్రవాహణ ప్రభువర ఓ3మ్
(అందరికీ ప్రభువైన ఓ ఈశ్వర మమ్ము రక్షించు)

100. అద్భుత మిత్ర కృపాకర ఓ3మ్
(గొప్ప మిత్రుడు, కృపను జూపువాడు)

101. మిత్రరూప వ్రతపాలక ఓ3మ్
(స్నేహ వ్రతమును పాలించువాడు)

102. నిశ్చిత మిత్ర నిరాశ్రయ ఓ3మ్
(సదా మిత్రుడు, ఆశ్రయము)

103. అధమోద్ధారక చిన్మయ ఓ3మ్
(దీనులనుద్ధరించువాడు
అనంత జ్ఞానము కలవాడు)

104. సత్య సుఖాత్మక సర్వద ఓ3మ్
(సత్యసుఖముతో కూడి, సృష్టిని దానము చేయువాడు)

105. నిర్గుణ రూప నిరామయ ఓ3మ్
(రూపరస గంధాది గుణములు
అజీర్ణాది రోగములు లేనివాడు)

106. ఆనందామృత వర్షక ఓ3మ్
(ఆనందమనే అమృతము నిచ్చువాడు)

107. గణనాయక గణపాలక ఓ3మ్
(దేవతాది గణములకు నాయుకుడు - పోషకుడు)

108. మర్మాచ్ఛాదక విభువర ఓ3మ్
(జీవనమునకు కారణములైన ప్రాణాదులను కప్పియుంచువాడు)

అనంత గుణగణ భూషిత ఓ3మ్

శుద్ధబ్రహ్మ పరాత్పర ఓ3మ్

(ఇతి ప్రణవ స్తోత్రం)



## పరమాత్ముని అష్టోత్తర శతనామములు

1. ఓమ్
2. ఖమ్
3. బ్రహ్మము
4. అగ్ని
5. మనువు
6. ప్రజాపతి
7. ఇంద్రుడు
8. ప్రాణము
9. బ్రహ్మ
10. విష్ణువు
11. రుద్రుడు
12. శివుడు
13. అక్షరుడు
14. స్వరాట్
15. కాలాగ్ని
16. దివ్యుడు
17. సుపర్ణుడు
18. గరుత్మంతుడు
19. మాతరిశ్వుడు
20. భూమి
21. విరాట్
22. విశ్వుడు
23. హిరణ్యగర్భుడు
24. వాయువు
25. తైజసుడు
26. ఈశ్వరుడు
27. ఆదిత్యుడు
28. ప్రాజ్ఞుడు
29. మిత్రుడు
30. వరుణుడు
31. అర్యముడు
32. బృహస్పతి
33. ఉరుక్రముడు
34. సూర్యుడు
35. పరమాత్మ
36. పరమేశ్వరుడు
37. సవిత
38. దేవుడు, దేవి
39. కుబేరుడు
40. పృథివి
41. జలము
42. ఆకాశము
43. అన్నము
44. అన్నాదుడు
45. వసువు
46. నారాయణుడు
47. చంద్రుడు
48. మంగళుడు
49. బుధుడు
50. శుక్రుడు
51. శనైశ్చరుడు

52. రాహువు
53. కేతువు
54. యజ్ఞము
55. హోత
56. బంధువు
57. పిత
58. పితామహుడు
59. ప్రపితామహుడు
60. మాత
61. ఆచార్యుడు
62. గురువు
63. అజుడు
64. సత్యము
65. జ్ఞానము
66. అనంతుడు
67. అనాది
68. సత్
69. చిత్
70. ఆనందుడు
71. నిత్యుడు
72. శుద్ధుడు
73. బుద్ధుడు
74. ముక్తుడు
75. నిరాకారుడు
76. నిరంజనుడు
77. గణేశుడు
78. గణపతి
79. విశ్వేశ్వరుడు
80. కూటస్థుడు
81. శక్తి
82. శ్రీ
83. లక్ష్మి
84. సరస్వతి
85. సర్వశక్తిమంతుడు
86. న్యాయకారి
87. దయాళువు
88. అద్వైతుడు
89. నిర్గుణుడు
90. సగుణుడు
91. అంతర్యామి
92. ధర్మరాజు
93. యముడు
94. భగవంతుడు
95. పురుషుడు
96. విశ్వంభరుడు
97. కాలుడు
98. శేషుడు
99. ఆప్తుడు
100. శంకరుడు
101. మహాదేవుడు
102. ప్రియుడు
103. స్వయంభువు
104. కవి
105. అత్మా
106. ఆత్మ
107. అచిన్త్యుడు
108. సర్వజగత్ కర్త

(ఇతి అష్టోత్తర శత నామావళి)



సచ్చిదానందేశ్వరాయనమః

# యజుర్వేద స్తుతి

## ఈశ్వరోపదేశము

## నివేదన

ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం ఈ చతుర్వేదాలు భగవంతుని జ్ఞానం.

ఋగ్వేదం వలన పదార్థ విజ్ఞానం విశదమవుతుంది.

యజుర్వేదం వలన కర్మకాండ బోధ పడుతుంది.

సామవేదం వలన ఆనందప్రాప్తి కలుగుతుంది.

అథర్వ వేదం వలన సంశయ నివృత్తి కలుగుతుంది.

యజుర్వేదంలో నలభై అధ్యాయాలు ఉన్నాయి. యజుర్వేదంలోని నలభై అధ్యాయాల నుండి పరమేశ్వరోపాసన మానవుని సామాజిక బాధ్యతలు, లోకకళ్యాణానికి సంబంధించిన నలభై వాక్యాలను తీసుకొని, యజుర్వేద స్తుతి అనే పేరుతో సంక్షిప్తంగా వ్యాఖ్యానం చేశాము.

1. **సమస్తజనులు ధర్మానుష్ఠానంలో స్థిరంగా వుండాలి. సజ్జనులతో మైత్రిని సంపాదించాలి. వేదములను శ్రద్ధతో చదవాలి చదివించాలి. నిరంతరం పరోపకారం చేయాలి. ఇదే జీవిత పరమార్థంగా భావించాలి.**

2 **పరమాత్మయందు ప్రీతిని కలిగి వుండాలి. సద్గుణాలను విస్తరింపచేసుకోవాలి. అందరి వున్నతికై ఆలోచించాలి.**



3. మంగళమయుడు అందరిని పాలించు పరమేశ్వరుని ఆజ్ఞలను అందరూ పాలించాలి. ఇహపర సుఖాలను అనుభవించాలి. అందరికీ ఆదర్శంగా జీవించాలి.

4. విద్వాంసులు భగవంతుని యందు సర్వదా భక్తి శ్రద్ధలు కలిగివున్నట్లే, ఇతరులు పరమాత్మయందు ప్రీతిని కలిగి వుండాలి. ఇది మానవుని జీవనధర్మం.

5. మానవులు సర్వ విద్యలకు నిలయమైన (వాగ్దేవి) వాణితో ఈశ్వర స్తుతి ప్రార్థనా ఉపాసనాదులు నిరంతరం చేయాలి. భగవంతుని భక్తితో భజించాలి.

6. స్త్రీ పురుషులు బాధ్యతాయుతమైన ధర్మ కర్మలను యథావిధిగా నిర్వహించాలి. బిడ్డల యెడల తల్లిదండ్రుల కర్తవ్యం, తల్లిదండ్రుల యెడల బిడ్డల కర్తవ్యం శ్రద్ధతో నెరవేర్చాలి. ఇది సామాజిక ధర్మం.

7. తల్లితండ్రుల సంతానాన్ని సర్వోత్తమ గుణయుక్తుడు, సకలవిద్యలలో అందరికంటే శ్రేష్ఠులైన విద్వాంసులు, పండితుల ఆశ్రయంలో చదివించాలి.

8. దంపతులు గృహస్థ ధర్మాన్ని శ్రద్ధతో సేవించాలి. ఉత్తమ సంతానాన్ని ఉత్పన్నం చేయాలి. వారిని సద్గుణవంతులను చేయాలి.

9. పతిపత్నులు పరస్పరం అనుకూలవంతులై, అన్యోన్యానురాగవంతులై, ఆనందితులై ప్రీతితో గృహస్థాశ్రమంలో జీవించాలి. అదే దంపతుల ధర్మం.

10. గృహకార్యాలయందు స్త్రీ కుశలురాలై సమస్త కార్యాలను సమర్థవంతంగా నిర్వహించి వాటిని అభివృద్ధి చేయాలి. పెద్దలయందు శ్రద్ధతో వర్తించాలి.

11. సుదక్షురాలైన స్త్రీ గృహకార్యాలకు సంబంధించిన అంశాలను విద్వాంసులకు, విదుషీమణులకు ఉపదేశించాలి. గృహిణి తన బాధ్యతలను నిర్వహించాలి.

12. బ్రహ్మచర్యంతో విద్యనభ్యసించి వివాహం చేసుకున్న దంపతులు బహుశ్రుతులు కావాలి. శాస్త్ర ధర్మాలను వినాలి. ఆప్తుల నుండి, యథార్థవక్తల నుండి గ్రహించిన సత్యవిద్యలను సంతానానికి బోధించాలి.

13. మానవులు విద్యాకుశలురు, సర్వశుభ లక్షణ యుక్తులు, బలపరాక్రమవంతులై, అధర్మాన్ని అన్యాయాన్ని నిరంతరం అణచివేయాలి. సత్యాన్ని స్థాపించాలి.

14. భగవంతుని గుణకర్మ స్వభావాల కనుకూలంగా మానవులు వారి గుణకర్మ స్వభావాలను తీర్చిదిద్దుకోవాలి. అందుకు సత్పురుషుల సాంగత్యం చేయాలి.

15. మానవులు పరస్పరం కలుసుకున్నప్పుడు సత్కార భావంతో 'నమస్తే' పదాన్ని ఉచ్చరించాలి. శ్రద్ధతో ఈ వేదోక్త శిష్టాచారాన్ని అందరూ పాటించాలి.

16. ఈ లోకంలో మానవులు యోగ సంస్కారంతో జీవించాలి. ఆ జీవితమే పవిత్రమైంది. జగత్ ప్రసిద్ధుడైన పరమాత్ముని అందరూ సేవించి తరించాలి. కైవల్య ధాముని సర్వులు ఉపాసించాలి.

17. సమస్త మానవులు జగదుత్పాదకుడు, న్యాయకర్త పరమాత్మనే ఉపాసించాలి. అతడే శ్రోతవ్యుడు, అతడే మంతవ్యుడు. అతడే నిధిధ్యాసమొనర్చుటకు యోగ్యుడు. కనుక సర్వులు ఆ సర్వేశ్వరుని స్మరించి శాంతిశీలురు కావాలి. ధర్మవర్తనులుగా జీవించాలి.

18. పూర్ణ బ్రహ్మచర్యం, పూర్ణవిద్యలచే సుశీలుడు, శారీరక, ఆత్మికబల సంపన్నుడు, విద్వాంసుడు అయిన రాజుచే ప్రజలు పాలింపబడాలి. అట్లాంటి రాజునే జనులు సభాపతిగా వరించాలి. వారే చక్రవర్తి సింహాసనాన్ని అధిష్ఠించేందుకు యోగ్యులు.

19. దేశంలో పూర్ణ విద్వాంసులు, శూర వీరులు, గుణవంతులైన స్త్రీలు, సుఖప్రదములైన పశువులు, సభ్యత తెలిసిన ప్రజలు, మధుర ఫలయుక్తములైన అన్నములు, ఔషధములు ప్రాప్తించునట్లుగా పరమాత్ముడు సర్వమానవుల శుభకామనలు పూర్ణమగునట్లు అనుగ్రహించాలి. సమస్త మానవులు భగవంతుని యందు భక్తి శ్రద్ధలు కలిగియుండాలి.

20. శుభప్రదమైన పశువులను సంరక్షణ చేయాలి. వాటి పోషణ, పాలన, రక్షణలలో మానవులు శ్రద్ధ వహించాలి.

21. మానవులు వారిలోని శుభసామర్థ్యాలను సర్వజనుల హితార్థం వినియోగించి, లోకమందు ప్రశంసనీయులు కావాలి. ధర్మాన్ని స్థాపించి పూజనీయులు కావాలి.

22. వేదములను, వేదార్థములను ఎరిగినవారే ధర్మాధర్మములను తెలుసుకొని వ్యవహరిస్తారు. వారే లోకమందు కృతార్థులు. మానవులు వారినే అనుసరించాలి.

23. మానవులు శుద్ధాంతఃకరణులై వేదవిద్వాంసుల సత్సాంగత్యము, సత్యశాస్త్రాల పఠనము, యజ్ఞయాగాది శుభకార్యాలను ఆచరించి ధర్మాత్ములు కావాలి.

24. మానవులు ధర్మవ్యవహారంతో లక్ష్మిని – సిరి సంపదలను పొందాలి. వారు శ్రీమంతులు, యశోవంతులు, బుద్ధిమంతులు, కాంతిమంతులై లోకంలో వర్ధిల్లాలి. ప్రసిద్ధిని పొందాలి.

25. మానవులు వారి సుఖసంతోషాలకై భగవంతుని ప్రార్థిస్తారు. అట్లాగే ఇతరుల శాంతి సౌఖ్యాలకై పరమాత్మను అర్థించాలి. ఇది మానవ ధర్మం.

26. మానవులు వైద్యశాస్త్ర ఆధారంగా ఔషధాలను సేవించి, ఆరోగ్యవంతులు కావాలి. యోగాభ్యాసం ద్వారా శరీరాన్ని, మనస్సును, ఆత్మను స్థిరంగా, దృఢంగా వుంచుకోవాలి. నిరంతరం భగవంతుని ధ్యానించాలి.

27. సంసారమనే ఈ ప్రపంచంలో మానవులు సత్య విద్యలను సేవించాలి. అతులిత సుఖాలను అనుభవించాలి. అందరితో స్నేహ సౌజన్యాలతో వ్యవహరించాలి.

28. మానవులు ఐశ్వర్యాన్ని వృద్ధిచేస్తూ సత్యాన్ని, ధర్మాన్ని, విద్వాంసులను, పరమాత్మను సేవించాలి.

29. సత్పురుషుల సాంగత్యంతో సమస్త జనులు సత్కర్మలు ఆచరించాలి. ఆనందించాలి. వారే ఆచారసంపన్నులు.

30. మానవులు ధర్మంతో లభించిన పదార్థాలనే భోగించాలి. వారే లోకంలో సర్వోత్తములు యశస్వంతులు.

31. వేదముల కర్తయైన పరమాత్మనే అందరు ఉపాసించాలి. సమస్త మానవులు వేదములను అధ్యయనం చేసి, పరమాత్ముని ఆజ్ఞలకు అనుకూలంగా వర్తించాలి. అదే మానవుల ధర్మం.

32. జ్ఞానులు విద్యా వినయ సంపదలచే జనులను తృప్తిపరచాలి. వారిని సన్మార్గంలో నడిపించాలి. వారే చరితార్థులు, స్మరింప యోగ్యులు.

33. మానవులు సర్వశక్తిమంతుడైన పరమాత్మను సేవించాలి. ఆభగవంతుని ద్వారా శుద్ధబుద్ధిని పొందాలి. తద్వారా ఈశ్వరోపాసన చేయాలి. సర్వజ్ఞుని సాక్షాత్కారాన్ని అభిలషించాలి.

34. మానవులు యథార్థ వ్యవహారంతో ప్రసిద్ధమైన కీర్తి కలవారై తేజస్సును పొందాలి. లోకంలో యశోవంతులై పూజింపబడాలి. న్యాయమూర్తులై విరాజిల్లాలి.

35. విద్వాంసులు మానవులను విద్య ఉత్తమ జ్ఞానశిక్షణచే పండితులుగా, ధర్మాత్ములుగా చేయాలి. వారు ఆ విద్వాంసులనే ప్రథమంగా పితరులుగా గుర్తించి సేవించాలి. వారిని మార్గదర్శకులుగా భావించి ఆదరించాలి.

36. మానవులు జీవితపర్యంతం విద్వాంసుల మార్గంలో నడవాలి. ఉత్తమ ఆయువును పొందాలి. బ్రహ్మచర్యాన్ని ధర్మబద్ధంగా పాలించాలి. ఉత్తమ సంతానాన్ని ఉత్పన్నం చేయాలి. లోక కళ్యాణాన్ని కాంక్షించాలి. బాధ్యతగా సమాజానికి సేవ చేయాలి.

37. ధర్మ విద్యలచే స్త్రీ పురుషులు సుఖాన్ని, శాంతిని ఉన్నతిని పొందాలి. ఇతరుల సుఖాన్ని ఆశించాలి. పరుల శుభాన్ని వాంఛించాలి.

38. మానవులకు భగవంతుడు సర్వదా ఆనందాన్నిచ్చే సకల సాధనాలను ప్రసాదించాడు. అందుకే పరమాత్మ అందరికి సేవనీయుడు, భజనీయుడు, పూజనీయుడు. జనులు ఆ స్వామినే నిశ్చయంగా వరించాలి. పరమాత్ముని సేవలో తరించాలి.

39. మానవులు మృతశరీరాన్ని ఘృతాది సుగంధయుక్త పదార్థాలతో దహనం చేయాలి. ఇది పుణ్యకార్యంగా భావించాలి. వారే లోకంలో పుణ్యాత్ములు.

40. మానవులు ధర్మయుక్తమైన న్యాయవ్యవస్థను పాలించాలి. అల్ప మృత్యువును జయించాలి. ఈశ్వరుని ప్రార్థించాలి, విద్వాంసుని

సేవించాలి. బ్రహ్మహత్యాది దోషాలను నివారించాలి. (పరమాత్ముని, వేదాజ్ఞలను ధిక్కరించడం బ్రహ్మహత్యతో సమానం) సృష్టి విద్య యథార్థ స్వరూపాన్ని తెలుసుకోవాలి. దేహత్యాగానంతరం శాస్త్రవిధి ననుసరించి అంత్యేష్టి కర్మను చేయాలి. అందరి శుభాన్ని ఆశించేవారు ఈ వేదఆదేశాన్ని కర్తవ్యంగా అనుసరించాలి. ఇది భగవదాజ్ఞ.

పరమాత్మ సర్వత్ర పరిపూర్ణుడై, ఆకాశంవలె వ్యాపించి ఉన్నాడు. ఆ పరతత్త్వాని కంటే గొప్పదేదీలేదు. ఆ పరమాత్ముని నిజనామం 'ఓ3మ్'. అతడే సర్వజ్ఞుడు, కైవల్య స్వరూపుడు, సర్వేశ్వరుడు. సర్వశక్తిమంతుడు.

సత్య ఆచరణ భావంతో ఎవరు పరమాత్ముని శరణు వేడుతున్నారో, అంతర్యామి అయిన ఆ పరమాత్మ వారిలోని అవిద్యను నశింపచేస్తాడు. వారి ఆత్మను జ్ఞానంతో ప్రకాశింపచేస్తాడు, వారిని శుభగుణకర్మ స్వభావయుక్తంగా చేస్తాడు. శుద్ధమైన యోగ విజ్ఞానాన్ని వారికి అందిస్తాడు. సమస్త దుఃఖాల నుండి వారిని విడిపిస్తాడు. మోక్షసుఖాన్ని వారికే లభింపచేస్తాడు.

"నాస్తి వేదాత్పరం శాస్త్రం"

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఇది వేద ప్రియులెల్లరు నిరంతరం పఠింపదగిన యజుర్వేద స్తుతి.







# తృతీయ భాగము

చతుర్వేదములలోని ప్రసిద్ధ వేద సూక్తములు - వ్యాఖ్యానములు



# 1. లక్ష్మీ సూక్తము

(ఋగ్వేద పరిశిష్టము) ఈ సూక్తానికి దేవత - లక్ష్మీదేవి

## 16 మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము

వేదములలో - లక్ష్మీదేవి - దేవత - ఐశ్వర్యప్రదాతయైన ఆ పరమపురుషుని ఆ పరమాత్మని నామము స్త్రీ లింగములో లక్ష్మీదేవిగా వర్ణింపబడింది. ఆ లక్ష్మీదేవి స్తుతి ఈ సూక్తంలో మనకు ప్రత్యక్షంగా కనిపిస్తున్నది. లక్ష్మీప్రదుడైన ఆ పరమాత్మను కీర్తించడమే లక్ష్యంగా ఈ సూక్తం శ్లాఘించబడుతుంది. దీనినే లోకంలో శ్రీ సూక్తముగా ప్రసిద్ధంగా వ్యవహరిస్తున్నారు.

లక్ష్మీదేవి మంగళ స్వరూపిణి. సిరిసంపదలను ప్రసాదించు యజ్ఞ దేవత. సువర్ణ వర్ణంతో అందరిని ఆకర్షించే మనోహారిణి. ఆహ్లాదాన్ని ఆనందాన్ని సుఖాన్నిచ్చే శుభదేవత. సుఖసంతోషాలకు శాంతి సౌభాగ్యాలకు నిలయమైన ఆ శ్రీదేవి మమ్ములను కటాక్షించుగాక! మాతృదేవతయగు మహాలక్ష్మిని మేము శ్రద్ధతో ఆరాధింతుము. సత్యలక్ష్మీ జ్ఞానదేవతను మేము నిత్యము సేవించెదముగాక! యజ్ఞ యాగాది శుభకర్మల ఫలము వలన మాగృహములో లక్ష్మీదేవి స్థిరమగుగాక! సువర్ణ శోభితమైన లక్ష్మీదేవి మాకు ప్రసన్నమగునుగాక! చంద్రునివలె ప్రసన్నతను కాంతినిచ్చే లక్ష్మీదేవిని మేము నిత్యము అర్చించెదముగాక! ధనధాన్యములకు మా గృహము నిలయమగును గాక! ఆనంద స్వరూపిణి లక్ష్మీదేవి పేదరికమును దారిద్ర్యమును మా నుండి తొలగించుగాక!

జనులకు ఆకలిదప్పికల బాధ లేకుండ చేయుగాక! జ్ఞానలక్ష్మి ఛలకపటాలు అజ్ఞానమును మా నుండి తొలగించుగాక! మాకు మంచి సంతానమును బంధుమిత్రులను లక్ష్మీదేవి ప్రసాదించుగాక! నిత్యం భక్తి పుష్పాలతో పూజింపబడే లక్ష్మీదేవి మమ్ములను మా గృహాలను అలరించుగాక!

సమస్త ఐశ్వర్యములకు ఆధారమైన లక్ష్మీదేవిని మేము హృదయ పూర్వకముగా ఆహ్వానింతుము. సర్వ సంపదలకు ఆశ్రయమైన ఆమెను మేము నిత్యము ఉపాసింతుము. కరుణామయి - దయామయియైన లక్ష్మీదేవి మాకు ప్రసన్నమగును గాక!

త్రికరణ శుద్ధిగా మనోవాక్కాయ కర్మలతో ఋక్కులతో లక్ష్మీస్తవము స్తోత్రము - స్తుతి చేసి వేదమంత్ర సహితముగా శుద్ధమైన ఘృతము - ఆవునేయి ఓషధులు - హెూమద్రవ్యములు ఔషధీ గుణములు కలిగిన సమిధలతో అగ్నిహెూత్రములో ఆహుతులిచ్చి తదనుకూలముగ వర్తించి న్యాయమార్గమున ధనార్జన చేసిన వారికి సమస్త అభీష్టములు సిద్ధించును. వారు సాక్షాత్ లక్ష్మీ - పుత్రులని వేదము ప్రబోధిస్తున్నది.

## అథ లక్ష్మీ సూక్తమ్ - ఇదం లక్ష్మ్యై ఇదం న మమ

1. ఓమ్ హిరణ్య వర్ణాం హరిణీం, సువర్ణ రజతస్రజామ్।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ॥

2. ఓమ్ తాం మ ఆ వహ జాత వేదో లక్ష్మీ మనపగామినీమ్।
యస్యాం హిరణ్యం విందేయం, గామశ్వం పురుషానహమ్॥

3. ఓమ్ అశ్వపూర్వాం రథమధ్యాం, హస్తినాద ప్రమోదినీమ్।
శ్రియం దేవీ ముపహ్వయే, శ్రీర్ మాదేవీర్ జుషతామ్॥

4. ఓమ్ కాంసోస్మితాం హిరణ్య ప్రాకారా మార్ద్రామ్ జ్వలంతీం తృప్తాం తర్పయన్తీమ్।
పద్మేస్థితాం పద్మ వర్ణాం, తామిహెూపహ్వయే శ్రియమ్॥

5. ఓమ్ చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం, శ్రియం లోకే దేవజుష్టముదారాం।
తాం పద్మనేమిం శరణ మహం ప్రపద్యే అలక్ష్మీ ర్మే నశ్యతాం త్వాం వృణోమి॥

6. ఓమ్ ఆదిత్యవర్ణే తపసో2ధి జాతో, వనస్పతి స్తవ వృక్షో2థ బిల్వః।
తస్య ఫలాని తపసా నుదన్తు మా, యాన్తరా యాశ్చ బాహ్యా అలక్ష్మీః॥

7. ఓమ్ ఉపైతు మాం దేవసఖః, కీర్తిశ్చ మణినా సహ।
ప్రాదుర్భూతో2సి రాష్ట్రే2స్మిన్, కీర్తిం వృద్ధిం దదాతు మే॥

8. ఓమ్ క్షుత్పిపాసామలా జ్యేష్ఠా అలక్ష్మీర్నాశయా మ్యహమ్।
అభూతి మసమృద్ధిం చ సర్వాం నిర్ణుద మే గృహాత్॥

9. ఓమ్ గంధ ద్వారాం దురాధర్షాం, నిత్యపుష్టాం కరీషిణీమ్।
ఈశ్వరీం సర్వభూతానాం, తామిహోపహ్వయే శ్రియమ్॥

10. ఓమ్ మనసః కామ మాకూతిం, వాచః సత్య మశీమహి।
పశూనాం రూప మన్నస్య, మయి శ్రీః శ్రయతాం యశః॥

11. ఓమ్ కర్దమేన ప్రజా భూతా, మయి సంభ్రమ కర్దమ।
శ్రియం వాసయ మే కులే, మాతరం పద్మమాలినీమ్॥

12. ఓమ్ ఆపః సృజన్తు స్నిగ్ధాని, చిక్లీత వస మే గృహే।
ని చ దేవీం మాతరం, శ్రియం వాసయ మే కులే॥

13. ఓమ్ ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం, సువర్ణాం హేమమాలినీమ్।
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ॥

14. ఓమ్ ఆర్ద్రాం యః కరిణీం యష్టిం, పింగలాం పద్మమాలినీమ్।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ॥

15. ఓమ్ తాం మ ఆవహ జాతవేదో, లక్ష్మీ మనపగామినీమ్।
యస్యాం హిరణ్యం ప్రభూతం గావో, దాస్యో2శ్వాన్ విందేయం పురుషానహమ్॥

16. ఓమ్ యఃశుచిః ప్రయతో భూత్వా, జుహుయాదాజ్య మన్వహమ్।
శ్రియః పంచ దశర్చం చ, శ్రీకామః సతతం జపేత్॥



## 2. సరస్వతీసూక్తము

### చతుర్వేదములలోని 25 మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము
### దేవత సరస్వతీదేవి

వేద విద్యా పారంగతురాలైన సరస్వతీదేవి - వాణీ స్వరూపిణీ - బ్రహ్మస్థానంలో ఉపస్థితురాలైన విదుషీ స్త్రీ మరియు మాతృదేవత, ఈ ముగ్గురు దేవతలను కన్యలు - బ్రహ్మచారిణులు సర్వదా సేవించి పూజించాలి. బుద్ధిని విద్యను పొంది విద్వత్ శిరోమణులు కావాలని విద్యాదేవి ఉపదేశించుచున్నది. వేద సరస్వతిని ఆశ్రయించిన విదుషీమణి స్త్రీ మహత్ శాస్త్రాలను - చతుర్వేదాది విద్యలను అభ్యసించి సాక్షాత్ సమాజ సన్మానితురాలు కావాలి. ఆమెను దేవతా స్వరూపిణిగా భావించాలి. ఆమె పతి సర్వదా ఐశ్వర్యవంతుడు యశోవంతుడుగా కీర్తిని పొందాలి.

మహత్తరమైన వేద శాస్త్రాల శిక్షణ పొందిన సరస్వతీ - వాగ్దేవి అవిద్యను - అంధకారాన్ని మూఢత్వాన్ని దూరము చేసి శాస్త్ర సంశయాలను తొలగించాలి. సమస్త జగత్తును ప్రకాశింపచేసే వేదవేద్యుని వేద జ్ఞానమును - వేదమాతను అవమానము చేయరాదు, నిందింపరాదు. వేదాజ్ఞలను ధిక్కరించరాదు. వేదవాణిని ఆరాధించు స్త్రీ, పురుషులు సర్వశ్రేష్ఠులు.

వేద విద్యాంసురాలైన స్త్రీ మాతృదేవత. ఆమె తన సంతానమును గర్భాధారణ నుండి మొదలు సమస్త సత్య విద్యలను పూర్తి చేసే వరకు ఉత్తమ శిక్షణ నిచ్చి వారిని బ్రహ్మ నిష్ఠులు కర్మనిష్ఠులను చేయాలి. అట్లాంటి విదుషీ స్త్రీ మానవ జాతికి మహోపకారము చేస్తుంది. ఆమె తన సంతానం ద్వారా అపురూపమైన కీర్తిని అతులిత ఆనందాన్ని పొందుతుంది. విదుషీ

- పతివ్రతయైన స్త్రీ సర్వదా తన సత్యవాణి ద్వారా ఇతరులకు సత్య స్వరూపుడైన పరమాత్ముని మహిమలను బోధించి వారిని సత్యవాదులుగా తయారు చేయాలి. పురుషులును పరుల హితమును శుభమును కాంక్షించాలి.

వరప్రదాయిని సరస్వతీదేవి కళ్యాణ భరితమైన వాక్కులతో అందరికి కృపతో వేదజ్ఞానమును ప్రసాదించును. ఆ వేదవతి ధరిత్రీ మాతగా సర్వులకు సుఖశాంతులను మేథా ప్రజ్ఞలను దయతో అనుగ్రహించే వరదాత్రి. సరస్వతీదేవి సర్వ విద్యల సౌందర్య స్వరూపిణి. సమస్త సద్గుణముల విద్వత్ శిరోమణి. సర్వవిద్యల సమన్వితురాలు. వేదప్రకాశ దివ్యకాంతిమయి. సమర్థులు యోగ్యులయిన స్త్రీలు గృహధర్మములను సక్రమముగా నిర్వహిస్తారు. సంతానమునకు సద్విద్యలను నేర్పిస్తారు. వారు సర్వవిధాల మంగళ స్వరూపిణులుగా ప్రసిద్ధిని పొందుతారని విద్యాదేవత స్త్రీలను స్వస్తి వచనముతో ఆశీర్వదించినది. పురుషార్థినులైన స్త్రీలు సత్యవాణి - సరస్వతీదేవిని భక్తి పుష్పాలతో అర్చించి సేవించి తరించాలి. వారే ప్రశంసనీయులు.

సర్వవ్యాపకుడు సరస్వతీ స్వరూపిణియైన పరమాత్మ సర్వ సాక్షిగా ఆకాశమువలె అంతటా వ్యాపించియున్నాడని తెలుసుకొని అసత్యము పలుకరాదు. ఎవరిని నిందించకూడదు. దూషించకూడదు. పరుష వాక్యములను పలుకరాదు. సజ్జనుల యెడల దోషారోపణ చేయకూడదు. దుర్జనులకు సుగుణాలను ఆపాదించకూడదు. ఈ దూషిత స్వభావము కలవారిని సరస్వతీదేవి కటాక్షించదు. ఆమె వారి నుండి దూరమవుతుంది. వేదవాణి - వేదవిద్యలు సుశిక్షణ సత్యభాషణ సత్సంగము యోగాభ్యాసాలకు కారణమవుతాయి. మనోహారిణియైన ఈ వేదవతి విశ్వరూపము విశ్వవ్యాప్తమయినది.

మాతా సరస్వతీదేవి కరుణా కటాక్షములు కలిగిన స్త్రీలకు దుఃఖముండదు. ఆపదలు రావు. అందరి శ్రేయస్సును కాంక్షించే స్త్రీలను భగవద్వాణి - వేదము సర్వదా రక్షిస్తుంది.

రాజు శత్రురాజుల నుండి ప్రజలను రక్షించి అందరికి న్యాయమును సుఖమును చేకూర్చుతాడు. అట్లాగే వేదవిద్యల నెరిగి మహారాణి స్త్రీలను కన్నతల్లివలె కాపాడి వారిని విదుషీమణులుగానే చేస్తుంది.

సమస్త ప్రాణుల సుఖమును హితమును కోరి చేసే యాగమందు యజ్ఞకర్తలు ప్రసిద్ధమైన దేవతలుగా ప్రఖ్యాతిని పొందుతారు. సర్వాంతర్యామి రూపంలో సర్వత్ర వ్యాపించియున్న సరస్వతీ - వాగ్దేవిని యజ్ఞకర్తలు శ్రద్ధాభక్తులతో శ్లాఘిస్తూ ఆహుతులనిస్తారు. ఈ రమణీయములైన వేద మంత్రముల ద్వారా యజ్ఞక్రతువు జరిగి వర్షము వర్షిస్తుంది. ప్రాణికోటికి వర్షముతో ఉత్తమ అన్న జలాదులు భోజ్యపదార్థాలు సంప్రాప్తమవుతాయి. ఈ వాక్కు సత్యవాణి, దివ్యవాణి, భవ్యవాణి. ఇది యజ్ఞములో యజ్ఞ మంత్రాధిదేవతలతోపాటు హవిస్సును - యజ్ఞములో వేసే విశేష హవ్యద్రవ్యమును గ్రహిస్తుంది. ఇది అంతరిక్షములో నున్న మేఘాలను వర్షింపచేయడానికి సాధనమవుతుంది.

దక్షిణ దిశలో ఉపస్థితులైన జ్ఞానులు - విద్వాంసులు పూజ్యులు పితరులు త్రికరణముల పవిత్రత కొరకు యజ్ఞానుష్ఠానములను అనుసరింతురు. మాతా సరస్వతీదేవికి హవిస్సును సమర్పిస్తారు. ఈ వేదవాణి - సరస్వతీ యజ్ఞ యజమానులకు ధనధాన్యములను ప్రదానము చేస్తుంది. మాతా సరస్వతీ పుత్రులైన జ్ఞానదేవతలు - విద్వాంసులు అధ్యాపకులు ఉపదేశకులు సూక్ష్మమైన శాస్త్రధర్మాలను అత్యంత శ్రద్ధా భావంతో గ్రహిస్తారు. అట్లాగే మానవ సమాజములోని స్త్రీ పురుషులు గ్రహించాలి.

దివ్యమంగళ భరితమైన సరస్వతీదేవి సాక్షాత్ సర్వసౌఖ్య ప్రదాయని. ఆమె ధర్మపత్నియైన స్త్రీని పతిసేవలో సదా సంలగ్నమగునట్లుగా దీవించును. సరస్వతీదేవి కృపకు పాత్రుడైన వ్యక్తికి ఉత్తమ బుద్ధి ప్రాప్తించును. ఉత్తమ వాణితో ఉత్తమ గుణాలను పొంది అతడు లోకంలో ఐశ్వర్యవంతుడవుతాడు. సరస్వతీ నిలయంలో లక్ష్మీనివాసముంటుందని మహాత్ములు బోధించారు.

మనుష్యుడు బ్రహ్మచర్యాది నియమాలతో వేదమాత - సరస్వతీ దేవి అనుగ్రహంతో ఉత్తమ విద్యలను పొందాలి.

పరమ పురుషార్థ లక్ష్యముతో పూజనీయులైన వేద - విజ్ఞానులు శ్రద్ధాపూర్వకంగా వేద విద్యల నభ్యసించి పుణ్యకర్మలను చేసి పుణ్యలోకాలను పొంది మోక్షాది ఇష్టఫలములను సాధించవచ్చునని వేద-సరస్వతీదేవి ఉపదేశించుచున్నది.

## అథ సరస్వతీ సూక్తమ్

### ఇదం సరస్వత్యై ఇదం న మమ

1. ఓమ్ సరస్వతీ సాధయంతీ ధియన్న
ఇళాదేవీ భారతీ విశ్వతూర్తిః।
తిస్రో దేవీః స్వధయా బర్హిరేదమచ్ఛిద్రం
పాంతు శరణం నిషద్య ॥ (ఋ 2-3-8)

2. ఓమ్ ఇయమదదాద్రభసమృణచ్యుతం
దివోదాసం వధ్ర్యశ్వాయ దాశుషే
యా శశ్వన్తమాచఖాదావ సంపణిం
తాతే దాత్రాణి తవిషా సరస్వతి॥ (ఋ 6-61-1)

3. ఓమ్ ఇయం శుష్మేభిర్బిసఖా ఇవారుజత్సా -
ను గిరీణాం తవిషేభి రూర్మిభిః పారావత
ఘ్నీ మవసే సువృక్తిభిః సరస్వతీ మా
వివాసేమ ధీతిభిః॥ (ఋ 6-61-2)

4. ఓమ్ సరస్వతి దేవనిదో ని బర్హయ ప్రజాం
విశ్వస్య బృసయస్య మాయినః । ఉత
క్షితిభ్యో2అవనీరవిందో విషమేభ్యో అస్రవో
వాజి నీవతి॥ (ఋ 6-61-3)

5. ఓమ్ ప్రణోదేవీ సరస్వతీ వాజేభి ర్వాజినీవతీ
ధీనామవిత్ర్యవతు॥ (ఋ 6-61-4)

6. ఓమ్ యస్త్వా దేవి సరస్వత్యుపబ్రూతే ధనే హితే।
ఇంద్రం న వృత్రతూర్యే॥ (ఋ 6-61-5)

7. ఓమ్ త్వం దేవి సరస్వత్యవా వాజేషు వాజిని।
రదా పూషేవ నః సనిమ్॥ (6)

8. ఓమ్ ఉత స్యా నః సరస్వతీ ఘోరా హిరణ్యవర్తనిః
వృత్రఘ్నీ వష్టి సుష్టుతిమ్॥ (7)

9. ఓమ్ ఉత నః ప్రియా ప్రియాసు సప్తస్వసా
సుజుష్టా। సరస్వతీ స్తోమ్యాభూత్॥ (10)

10. ఓమ్ ఆపప్రుషీ పార్థివాన్యురు రజో
అంతరిక్షం। సరస్వతీ నిదస్పాతు॥ (11)

11. ఓమ్ ప్రయా మహిమ్నా మహినాసు చేకితే ద్యుమ్నే
భిరన్యా అపసామపస్తమా । రథ ఇవ బృహతీ
విభ్వనే కృతోపస్తుత్యా చికితుషా సరస్వతీ॥ (13)

12. ఓమ్ సరస్వత్యభి నో నేషి వస్యో మాప స్ఫరీః
పయసా మా న ఆ ధక్ । జుషస్వ నః సఖ్యా
చ మా త్వత్క్షేత్రాణ్యరణాని గన్మ ॥ (14)

13. ఓమ్ సరస్వతి త్వమస్మాన్ అవిడ్ఢి మరుత్వతీ
ధృషతీ జేషి శత్రూన్ । త్యం చిఛర్ధంతం
తవిషీయమాణమిన్రో హంతి వృషభం శండికానామ్॥ (ఋ 2-30-8)

14. ఓమ్ సరస్వతీం దేవయంతో హవంతే సరస్వతీ-
మధ్వరే తాయమానే। సరస్వతీం। సుకృతో
అహ్వాయంత సరస్వతీ దాశుషే వార్యం దాత్ (ఋ 10-17-7)

15. ఓమ్ సరస్వతి యా సరథం యయాథ
స్వధాభిర్దేవి పితృభిర్మదంతీ।
ఆసద్యాస్మిన్బర్హిషి మాదయస్వానమీవా
ఇష ఆ ధేహ్యస్మే॥ (8)

16. ఓమ్ సరస్వతీం యాం పితరోహవంతే దక్షిణా
యజ్ఞమభిన క్షమాణాః సహస్రార్ఘమిళో
అత్రభాగం రాయస్పోషం యజమానేషు ధేహి॥ (9)

17. ఓమ్ సరస్వతీ సరయుః సింధురూర్మిభిర్మహొ
మహీరవసా యంతు వక్షణీః దేవీరాపో
మాతరః సూదయిత్న్వో ఘృతవత్పయో మధుమన్నో అర్చత॥ (ఋ 10-64-9)

18. ఓమ్ సరస్వతీ మనసా పేశలం వసూనాసత్యాభ్యాం
వయతి దర్శతం వపుః రసం పరిస్రుతా
న రోహితం నగ్నహు ర్ధీర స్తసరం న వేమ॥ (యజుర్వేదం 19-83)

19. ఓమ్ సరస్వతీ యోన్యాం గర్భమంతరశ్విభ్యాం
పత్నీ సుకృతం బిభర్తి। అపాగ్ం రసేన
వరుణో న సామ్నేంద్రగ్ం శ్రియై జనయన్నప్సు రాజా॥ (యజు 19-94)

20. ఓమ్ సరస్వతీ మనుమతిం భగం యంతో
హవామహే। వాచం జుష్టాం మధుమతీ -
మవాదిషం దేవానాం దేవహూతిషు॥ (అథర్వణవేదం 5-7-4)

21. ఓమ్ సరస్వతి వ్రతేషు తే దివ్యేషు దేవి
ధామసు । జుషస్వ హవ్యమాహుతం
ప్రజాం దేవి రరాస్వ నః॥ (అ 7-68-1)

22. ఓమ్ సరస్వతీం దేవయంతో హవంతే
సరస్వతీ మధ్వరే తాయమానే సరస్వతీం
సుకృతో హవంతే సరస్వతీ దాశుషే
వార్యం దాత్॥ (అ 18-1-41)

23. ఓమ్ సరస్వతీం పితరో హవంతే దక్షిణా
యజ్ఞమభి నక్ష మాణాః। ఆసద్యాస్మిన్
బర్హిషి మాదయధ్వమనమీవా ఇష
ఆ ధేహ్యస్మ॥ (42)

24. ఓమ్ సరస్వతీ యా సరథం యయాథోక్ థైః
స్వధాభిర్దేవి పితృభిర్మదంతీ। సహస్రార్ఘమిడో
అత్రభాగం రాయస్పోషం యజమానాయ ధేహి॥ (43)

25. ఓమ్ అద్యాగ్నే అద్య సవితరద్య దేవి
సరస్వతి । అద్యాస్య బ్రహ్మణస్పతే
ధనురివా తానయా పసః॥ (అ 4-4-6)



## 3. గణపతి సూక్తము

### ఋగ్వేదము, యజుర్వేదములలో 6 మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము

### దేవత గణపతి

సమస్త గణములకు పాలకుడవైన హే పరమాత్మ! మేము శుభకర్మలు ఆచరించుటకు నిన్ను హృదయపూర్వకముగా ఆరాధిస్తున్నాము. భక్తులకు ప్రియమైన దేవదేవా! మేము శ్రద్ధతో నిన్ను స్తుతిస్తున్నాము. వేద విద్యాజ్ఞానాదులనిచ్చి రక్షించు సర్వజ్ఞ పరమేశ్వరా! నిన్ను మేము భక్తితో భజిస్తున్నాము. చరాచరజగత్తులోని, సమస్త ప్రాణులను ప్రకృతిని గర్భమున ధరించిన జగదీశ్వరా! మానవులందరు నిన్ను అత్యంత శ్రద్ధాభక్తులతో సేవింతురుగాక!

సమస్త దేవగణములకు అధిపతి అంతర్యామి లోకపూజ్యుడైన గణపతిని మేము నిత్యముపాసింతుము.

మానవులు తోటి ప్రాణులకు ఉపకారము చేయాలి. విద్వాంసుల సాంగత్యంలో వేదవిద్యలనభ్యసించాలి. సర్వ శుభములను పొంది సంతృప్తిగా జీవించాలి.

గణాధిపతియైన భగవంతుడు ప్రజలను పాలించు ప్రభువులకు ఉపదేశిస్తున్నాడు. క్షత్రియులు దుర్జనులను దునుమాడి సజ్జనులను రక్షించాలి. ధర్మపాలనతో విశేషమైన కీర్తి ప్రతిష్ఠ - యశస్సులను పొందాలి.

పంచభూతాలలో వాయువు నిత్యజీవనంలో మానవులకు ఎంతగానో ఉపయోగపడుతుంది. వాయువులేకుండా ప్రాణికోటి జీవించలేదు. దివ్యశక్తులు కలిగిన వాయువు వేద శాస్త్రాలలో ఉత్తమ దేవతగా చెప్పబడింది. ఈ వాయువు శుద్ధికొరకు, వాతావరణ కాలుష్య నివారణకు అగ్నిలో పుష్టికరమైన పదార్థాలతో శ్రద్ధతో హెూమము చేయాలని పరమాత్ముని ఉపదేశముగా మానవులు గ్రహించాలి.

## అథ గణపతి సూక్తమ్
## ఇదం గణపతయే ఇదం న మమ

1. ఓమ్ గణానాం త్వా గణపతిం హవామహే
ప్రియాణాంత్వా ప్రియపతిం హవామహే।
నిధీనాం త్వా నిధిపతిం హవామహే
వసో మమ ఆహమజాని గర్భధమాత్వమజాసి గర్భధమ్॥ (యజు. 23-19)

2. ఓమ్ గణానాం త్వా గణపతిం హవామహే కవిం
కవీనా ముప మశ్రవస్తమమ్।
జ్యేష్ఠ రాజం బ్రహ్మణాం బ్రహ్మణ స్పత ఆ నః
శృణ్వన్ నృతిభిః సీద సాదనమ్॥ (ఋ 2-23-1)

3. ఓమ్ ని షు సీద గణపతే గణేషు త్వా
మాహుర్వి ప్రతమం కవీనాం।
న ఋతే త్వాత్క్రియతే కించనారే
మహామర్కం మఘవం చిత్రమర్చ॥ (ఋ 10-112-9)

4. ఓమ్ ప్రతూర్వన్నేహ్యవక్రామన్న శస్తీ
రుద్రస్య గణపత్యం మయోభూరేహి।
ఉర్వంతరిక్షం వీహి స్వస్తి గవ్యూతి రభయాని
కృణ్వాన్ పూష్ణా సయుజా సహ॥ (య. 11-15)

5. ఓమ్ నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమో
నమో వ్రాతే భ్యో వ్రాతపతిభ్యశ్చ వో నమో।
నమో గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చ వో నమో
నమో విరూపేభ్యో విశ్వ రూపేభ్యశ్చవో నమః ॥ (య 16-25)

6. ఓమ్ అసవే స్వాహా వసవే స్వాహా విభువే స్వాహా
వివస్వతే స్వాహా గణశ్రియే స్వాహా గణపతయే
స్వాహా అభిభువే స్వాహా అధిపతయే స్వాహా
శూషాయ స్వాహా సం సర్పాయ స్వాహా చంద్రాయ స్వాహా
జ్యోతిషే స్వాహా ములిమ్లుచాయ స్వాహా
దివా పతయే స్వాహా॥ (య 22-30)





## 4. విష్ణుసూక్తము

### చతుర్వేదములలోని 12 మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము
### దేవత విష్ణువు

వేద విదులైన విద్వాంసుల ఉపదేశములతోనే సృష్టి విద్యమానవులకు బోధపడుతుంది. సమస్త విశ్వాన్ని సర్వపదార్థములను సృష్టికర్త పరబ్రహ్మ సృజించాడు.

పరాత్పరుడు ఈ జగత్తును మూడు విధాలుగా విభజించాడు. ఒకటి పృథివీ. రెండవది అంతరిక్షం. మూడవది ద్యులోకం. పరమాత్ముడు తన సామర్థ్యంతోనే సమస్త బ్రహ్మాండాన్ని నిర్మించాడు. సమస్త విశ్వాన్ని ఆయనే ధారణ చేస్తున్నాడు.

సర్వ ప్రాణులకు మిత్రుడైన జగదీశ్వరుడు జీవులకు వాటి కర్మానుసారము సాధనలతో కూడిన శరీరాదులను ప్రసాదించాడు.

ప్రాణులన్నీ సూర్యకాంతిలో శుద్ధనేత్రాలతో సృష్టిలోని పదార్థాలను దర్శించినట్లే, వేదవేత్తలు నిర్మల విజ్ఞానంతో శ్రేష్ఠ ఆలోచనలతో వారి శుద్ధ అంతకరణాలలో సాక్షీభూతుడైన ఆ సర్వేశ్వరుని సాక్షాత్కారమును పొందుతారు. అదే ఆనందధామము, అదే మోక్షధామము, అదే పరంధామము. మానవులు పావనతరమైన మనస్సుతో విద్య ధర్మాచరణతో సత్యభాషణాదులతో సచ్చిదానంద స్వరూపుడు సర్వవ్యాపకుడైన విష్ణువును విష్ణుపదమును దర్శించగలరు.

పరమాత్ముని భక్తిశ్రద్ధలతో సేవించినవారికే. చక్రవర్తి రాజ్య సౌఖ్యములు లభించును. వారే ధర్మవర్తనులై ప్రజలను పాలింప యోగ్యులగుదురు.

పరమాత్ముడు సర్వప్రాణుల హితార్థము పరమాణువులలో సంయోగ వియోగ శక్తినిచ్చి అనేక లోకాలను నిర్మించి ఉత్పత్తి స్థితి ప్రళయాలను చేశాడు. ఆ భగవంతునే మానవులు భజించాలి. ఆ ఈశ్వరునే స్తుతి ప్రార్థనోపాసనలు చేయాలి.

విష్ణు స్వరూపుని సత్య స్వరూపము సర్వత్ర వ్యాపకము. ఆయన మహిమలు జగద్విదితములు. ఆయన సామర్థ్యము సర్వజ్ఞత్వము. వేదవేత్తలైన విద్వాంసులకు యోగులకు ఆ పరబ్రహ్మము ప్రత్యక్షమే.

## అథ విష్ణుసూక్తమ్
## ఇదం విష్ణవే ఇదం న మమ

1. ఓమ్ అతో దేవా అవంతు నో యతో విష్ణుర్విచక్రమే।
పృథివ్యాః సప్తధామభిః॥ (ఋ 1-22-16, నుండి 21)

2. ఓమ్ ఇదం విష్ణుర్వి చక్రమే త్రేధా
ని దధే పదమ్ సమూళ్హమస్య పాంసురే॥

3. ఓమ్ త్రీణి పదా వి చక్రమే విష్ణుర్గోపా
అదాభ్యః అతో ధర్మాణి ధారయన్॥

4. ఓమ్ విష్ణోః కర్మాణి పశ్యత
యతో వ్రతాని పస్పశే ఇంద్రస్య యుజ్యః సఖా॥

5. ఓమ్ తద్విష్ణోః పరమం పదం
సదా పశ్యంతి సూరయః దివీవ చక్షురాతతమ్॥

6. ఓమ్ తద్విప్రాసో విపన్యవో
జాగృవాంసః సమింధతే
విష్ణోర్యత్పరమం పదమ్॥



7. ఓమ్ యా తే ధామాన్యుశ్మసి గమధ్యై
యత్రగావో భూరి శృంగా ఆయాసః।
అత్రాహ తదురుగాయస్య విష్ణోః
పరమం పదమవభారి భూరి।
బ్రహ్మవనిత్వా క్షత్రవని రాయస్పోషవని
పర్యూహామి బ్రహ్మదృగ్ం హ క్షత్రం
దృగ్ం హాయుర్దృగ్ం హ ప్రజాం దృగ్ం హా॥ (యజు 6-3)

8. ఓమ్ అతో దేవా అవంతు నో యతో
విష్ణుర్విచక్రమే పృథివ్యా అధి సానవి॥ (సామ 1674)

9. ఓమ్ విష్ణోర్ను కం ప్రా వోచం వీర్యాణి యః
పార్థివాని విమమే రజాంసి యో అస్క భాయదుత్తరం సధస్థం
విచక్ర మాణస్త్రే ధోరుగాయః॥ (అథర్వ 7-26-1)

10. ఓమ్ ప్రతద్ విష్ణు స్తవతే వీర్యాణి మృగోన భీమః
కుచరో గిరిష్ఠాః। పరావత ఆ జగమ్యాత్ పరస్యాః॥ (అథర్వ 7-26-2)

11. ఓమ్ యస్యోరుషు త్రిషు విక్రమణే
ష్వధిక్షియంతి భువనాని విశ్వా ఉరు విష్ణో
విక్రమస్వోరు క్షయాయ నస్కృధి ఘృతం
ఘృతయోనే పిబ ప్రప్ర యజ్ఞపతిం తిర॥ (అథర్వ 7-26-3)

12. ఓమ్ దివో విష్ణ ఉత వా పృథివ్యా
మహో విష్ణ ఉరోరంతరిక్షాత్ హస్తౌ పృణస్య బహుభిర్వసవ్యై
రాప్రయచ్ఛ దక్షిణాదోత సవ్యాత్॥ (అథర్వ 7-26-8)







# 5. పురుష సూక్తము

## యజుర్వేదము, 31వ అధ్యాయము
## 22 మంత్రముల - సంక్షిప్త వ్యాఖ్యానము
## దేవత పురుషోత్తముడు

విరాట్ స్వరూపుడైన పూర్ణ పురుషుడు సహస్ర శిరస్సులతో సహస్ర నేత్రములతో సహస్ర పాదములతో విరాజిల్లుచున్నాడు. ఆ పరిపూర్ణుడైన పరమాత్ముడే ఈ సృష్టిని రచించి పోషించి లయము చేయుచున్నాడు. ఆయనే ఈ సమస్త సృష్టికి ఆధారము. ఇది వేదములో పరమాత్ముని ఆలంకారిక వర్ణన.

ఈ సృష్టి అంతయు భగవంతుని మహిమలను తెలియచేయుచున్నది. సువిశాలమైన ఈ విశ్వమంత ఆ పరమాత్మునిలో నాలుగవ భాగములోనే వున్నది. మిగిలిన మూడు భాగములు ఆనందలోకములే. ఆ లోకములలో పరమేశ్వరుని పరిపూర్ణ స్వరూపమే ప్రత్యక్షమగుచున్నది. పరమేశ్వరుడు సర్వజగత్తుకు ఆధారమై అధిష్ఠాతగా ప్రకాశించుచున్నాడు. లోక కళ్యాణ స్వరూపుడైన ఆది పురుషుని సర్వులు ఉపాసించాలి. లోకపూజ్యుడైన ఆ దేవదేవుని మానవులంతా మనస్సులో ధ్యానించాలి. సృష్టికర్తయైన విధాతను వేదము ఎన్నో విధాలుగా కీర్తిస్తుంది.

ఆ పరంధాముని నాభినుండి అంతరిక్షలోకము శిరస్సునుండి ద్యులోకము, పాదముల నుండి పృథివి లోకము ఆవిర్భవించాయి. శ్రోత్రముల నుండి దిశలు అట్లే ఇతర లోకాలు ఉత్పన్నమయ్యాయని వేదం భగవంతుని వర్ణిస్తున్నది.



వేద విద్వాంసులు వేదవిహితమైన ధర్మకార్యములతో పూజ్యనీయుడైన యజ్ఞ భగవానుని ఉపాసిస్తున్నారు. ఇది అనాదిగా సృష్ట్యాది నుండి వస్తున్న వైదిక జీవనధర్మము.

మనం మన జీవితములో సర్వోత్తముడు, పురుషోత్తముడు, సర్వశ్రేష్ఠుడు, ఆనందమయుడైన వేదవేద్యుని తెలుసుకోవాలి. త్రివిధ దుఃఖాల నుండి వేరై మోక్ష సుఖాన్ని అనుభవించాలి.

నాశరహితుడైన పరమాత్మునకు జనన జరామరణ దుఃఖాలు లేవు. ఆయన అందరి హృదయాలలో భాసిల్లుతున్నాడు. హే సౌందర్యాధిపతియైన పరమేశ్వరా! నీలోని పరిపూర్ణ శోభ అత్యంత రమణీయమయినది. నీ అనంతమైన సర్వాలంకృతమైన సౌందర్యముచే సమస్త జగత్తు సుశోభితమై రమణీయముగ ప్రకాశించుచున్నది. సూర్యచంద్ర నక్షత్రాదుల శోభ స్వయంగా నీ అనంత సృష్టిలో ఒక భాగమే. నీవు ప్రత్యక్ష బ్రహ్మవు.

హే దేవా! నీ జ్ఞాన ఛాయతో మమ్ములను సర్వ శుభంకరమైన మంగళమయ మార్గములో నడిపించుము. ముక్తి మార్గమును చూపించుము.

## అథ పురుష సూక్తమ్

## ఇదం పురుషాయ ఇదం న మమ

ఓమ్ సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్ర పాత్।
స భూమిం సర్వత స్పృత్వాత్య తిష్ఠద్దశాఙులమ్॥ 1

ఓమ్ పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చభవ్యమ్।
ఉతామృతత్వ స్యేశానో యదన్నేనాతి రోహతి॥ 2



ఓమ్ ఏతావానస్య మహిమాతో జ్యాయాన్ శ్చ పూరుషః।
పాదో2స్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి॥ 3

ఓమ్ త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదో2స్యేహా భవత్పునః।
తతో విష్వఙ్ వ్యక్రామత్సాశనానశనే అభి॥ 4

ఓమ్ తతో విరాడజాయత విరాజో అధి పూరుషః।
సజాతో అత్యరిచ్యత పశ్చాద్భూమి మథోపురః॥ 5

ఓమ్ తస్మాద్యజ్ఞాత్సర్వహుతః సమ్భృతం పృషదాజ్యమ్।
పశూన్‌స్తాన్‌శ్చక్రే వాయవ్యా నారణ్యా గ్రామ్యాశ్చ యే ॥ 6

ఓమ్ తస్మాద్యజ్ఞాత్సర్వహుత ఋచః సామానిజజ్ఞిరే।
ఛన్దాంసి జజ్ఞిరే తస్మాద్యజు స్తస్మా దజాయత॥ 7

ఓమ్ తస్మాదశ్వా అజాయన్త యేకే చోభయాదతః।
గావో హ జజ్ఞిరే తస్మాత్తస్మాజ్జాతా అజావయః॥ 8

ఓమ్ తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ పురుషం జాతమగ్రతః।
తేన దేవా అయజన్త సాధ్యా ఋషయశ్చ యే॥ 9

ఓమ్ యత్పురుషం వ్యదధుః కతిధా వ్యకల్పయన్।
ముఖం కిమస్యాసీత్ కింబాహూ కిమూరూ పాదా ఉచ్యేతే॥ 10

ఓమ్ బ్రాహ్మణో2స్య ముఖమాసీద్ బాహూ రాజన్యః కృతః।
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత 11

ఓమ్ చన్ద్రమా మనసో జాతశ్చక్షోః సూర్యో అజాయత।
శ్రోత్రాద్వాయుశ్చ ప్రాణశ్చ ముఖాదగ్ని రజాయత॥ 12

ఓమ్ నాభ్యా ఆసీదన్తరిక్షం శీర్ష్ణోద్యౌః సమవర్తత।
పద్భ్యాం భూమిర్దిశః శ్రోత్రాత్తథా లోకాన్ అకల్పయన్॥ 13

ఓమ్ యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞమతన్వత।
వసన్తో2స్యాసీ దాజ్యం గ్రీష్మ ఇధ్మః శరద్ధవిః॥ 14

ఓమ్ సప్తాస్యాసన్ పరిధయస్త్రిః సప్తసమిధః కృతాః।
దేవా యద్యజ్ఞం తన్వానా అబధ్నన్ పురుషం పశుమ్॥ 15

ఓమ్ యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్।
తే హ నాకం మహిమానః సచన్త యత్రపూర్వే సాధ్యాః సన్తి దేవాః॥ 16

ఓమ్ అద్భ్యః సమ్భృతః పృథివ్యైరసాచ్చ విశ్వకర్మణః సమవర్తతాగ్రే।
తస్య త్వష్టా విదధద్రూపమేతి తన్మర్త్యస్య దేవత్వమాజాన మగ్రే॥ 17

ఓమ్ వేదాహమేతం పురుషం మహాన్తమాదిత్య వర్ణం తమసః పరస్తాత్।
తమేవ విదిత్వాతి మృత్యుమేతి నాన్యః పన్థా విద్యతే2యనాయ॥ 18

ఓమ్ ప్రజాపతిశ్చరతి గర్భే అన్తరజాయమానో బహుధా విజాయతే।
తస్య యోనిం పరిపశ్యన్తి ధీరాస్తస్మిన్హ తస్థుర్భువనాని విశ్వా। 19

ఓమ్ యో దేవేభ్యః ఆతపతి యో దేవానాం పురోహితః।
పూర్వో యో దేవేభ్యోజాతో నమో రుచాయ బ్రాహ్మ యే॥ 20

ఓమ్ రుచం బ్రాహ్మం జనయన్తో దేవా అగ్రేతదబ్రువన్।
యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్తస్య దేవా అసన్వశే॥ 21

ఓమ్ శ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యావహోరాత్రే పార్శ్వే నక్షత్రాణి రూపమశ్వినౌ వ్యాత్తమ్।
ఇష్ణన్నిషాణాముం మ 2ఇషాణ సర్వలోకం మ 2ఇషాణ॥ 22

ఇతి ఏకత్రింశో2ధ్యాయః



# 6. యజ్ఞసూక్తము

## యజుర్వేదము 18వ అధ్యాయము - చమకము
## 77 మంత్రముల - సంక్షిప్త వ్యాఖ్యానము

ఈ సృష్టిలోని సమస్త జీవకోటిలో మానజన్మ సర్వోత్తమమైనది. పరాత్పరుడైన పరమాత్ముడు వేదముల ద్వారా మానవులకు శిష్టాచారమును ధర్మమును మోక్షమార్గమును బోధిస్తున్నాడు.

మానవులు వారి తనువును మనస్సును ప్రాణములను ధర్మమును ఆచరించుటకు సమర్పించాలి. శమదమాది గుణములతో నియమంగా జీవించాలి. పరమాత్ముని స్తుతి ప్రార్థనోపాసనలతో వారి మనోభీష్టము లన్నియు సఫలము చేసుకోవాలి. వారు పరమ పురుషార్థమునకై ఆ జగదీశ్వరుని అర్చించాలి. వారి జీవనము పావనము కావాలి. యోగాభ్యాసముతో సంయమంగా జీవిస్తూ బుద్ధిని సిద్ధిని పొందాలి. మానవులు వారి సమస్త సామర్థ్యాలను సర్వప్రాణి హితార్థము సద్వినియోగము చేయాలి. వారు సర్వదా ప్రశంసనీయులు. సుదృఢమైన శరీరాంగములతో ఉత్తమ ఆలోచనలతో సర్వదా దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయాలి.

సమస్త ప్రాణుల సుఖాన్ని ఆశించి యజ్ఞము చేయువారు మహాశయు లగుదురు. యజ్ఞ భగవానునికి నిష్కామ భావముతో సర్వము సమర్పించినవారు ఆ పరమపురుషుని కృపకు పాత్రులగుదురు. సర్వులు సత్కర్మలు ఆచరించి సత్పురుషులను సన్మానించి సత్కీర్తిని పొందాలి.

ఈ పృథివిలోని పదార్థాలలో అన్నమే శ్రేష్ఠమైనది. అన్నమును దానము చేయువారు లోకములో ప్రశస్తిని పొందుదురు.

ప్రతి నిత్యము అగ్నిహోత్రాది శుభకర్మలు ఆచరించువారు సమస్త లోకములకు శుభమును చేకూర్చుదురు. పురుషార్థులు సుమనస్కులు వేదవేత్తలగువారు లోకశ్రేయస్సును కాంక్షింతురు. వారు ఈ లోకానికే ఆభూషణము వంటివారని పరమాత్మని ఉపదేశము. మనుష్యుడు న్యాయవంతుడు, క్షమాశీలి, ఔషధసేవి, యుక్తాహారి, జితేంద్రియుడై శతవర్షములు జీవించాలి. ఈశ్వరుని గుణకర్మ స్వభావమునకు, సృష్టిక్రమమునకు, ఆప్తుని ఆచారమునకు, ఆత్మకు, మనస్సుకు అనుకూలముగ వర్తించువారు సతతము సత్యోపదేశము చేయువారు వేద భగవానుని కృపకు పాత్రులై అత్యంత సుఖమును అనుభవింతురు.

## అథ యజ్ఞసూక్తమ్

ఇదం యజ్ఞాయ ఇదం న మమ

ఓమ్ వాజశ్చ మే ప్రసవశ్చ మే ప్రయతిశ్చ మే ప్రసితిశ్చ మే క్రతుశ్చ మే స్వరశ్చ మే
శ్లోకశ్చ మే శ్రవశ్చ మే శ్రుతిశ్చ మే జ్యోతిశ్చ మే స్వశ్చమే యజ్ఞేన కల్పన్తామ్॥ 1

ఓమ్ ప్రాణశ్చ మే2పానశ్చ మే వ్యానశ్చ మే2సుశ్చ మే చిత్తంచ మ ఆధీతం చమే
వాక్ చ మే మనశ్చ మే చక్షుశ్చ మే శ్రోత్రం చ మే దక్షశ్చ మే బలం చ మే
యజ్ఞేన కల్పన్తామ్॥ 2

ఓమ్ ఓజశ్చ మే సహశ్చ మ ఆత్మా చ మే తనూశ్చ మే శర్మ చ మే వర్మ చ మే2జ్గాని
చ మే 2స్థీని చ మే పరూం షి చ మే శరీరాణి చ మ ఆయుశ్చ మే జరా చ
మే యజ్ఞేన కల్పనామ్॥ 3

ఓమ్ జ్యైష్ఠ్యం చ మ ఆధిపత్యం చ మే మన్యుశ్చ మే భామశ్చ మే2మశ్చ మే2మ్భశ్చ మే జేమా చ మే మహిమా చ మే, వరిమా చ మే ప్రథిమా చ మే వర్షిమా చ మే ద్రాఘిమా చ మే వృద్ధం చ మే వృద్ధిశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 4

ఓమ్ సత్యం చ మే శ్రద్ధా చ మే జగచ్చమే ధనం చ మే విశ్వం చ మే మహశ్చ మే క్రీడా చ మే మోదశ్చమే, జాతం చ మే జనిష్యమాణం చ మే సూక్తం చ మే సుకృతం చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 5

ఓమ్ ఋతం చమే2మృతం చ మే2యక్ష్మం చ మే2నామయచ్చ మే జీవాతుశ్చమే దీర్ఘాయుత్వం చ మే2నమిత్రం చ మే2భయం చ మే సుఖం చ మే శయనం చ మే సూషాశ్చ మే సుదినం చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 6

ఓమ్ యన్తా చ మే ధర్తా చ మే క్షేమశ్చమే ధృతిశ్చ మే విశ్వం చ మే మహశ్చ మే సంవిచ్చ మే, జ్ఞాత్రం చ మే సూశ్చ మే ప్రసూశ్చ మే సీరం చ మే లయశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 7

ఓమ్ శం చ మే మయశ్చ మే ప్రియం చ మే2నుకామశ్చ మే కామశ్చ మే సౌమనశ్చ మే, భగశ్చ మే ద్రవిణం చ మే భద్రం చ మే శ్రేయశ్చ మే వసీయశ్చ మే యశశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 8

ఓమ్ ఊర్క్ చ మే2సూనృతాం చ మే పయశ్చ మే రసశ్చ మే ఘృతం చ మే మధు చ మే సగ్ధిశ్చమే, సపీతిశ్చ మే కృషిశ్చ మే వృష్టిశ్చ మే జైత్రం చ మ ఔద్భిద్యం చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 9

ఓమ్ రయిశ్చ మే రాయశ్చ మే పుష్టం చ మే పుష్టిశ్చ మే విభు చ మే ప్రభు చ మే పూర్ణం చ మే, పూర్ణతరం చ మే కుయవం చ మే2క్షితం చ మే2న్నం చ మే2క్షుచ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 10

ఓమ్ విత్తం చ మే వేద్యం చ మే భూతం చ మే భవిష్యచ్చ మే సుగం చ మే సుపథ్యం చ మ2ఋద్ధం చ మ2ఋద్ధిశ్చమే, క్లుప్తం చ మే క్లుప్తిశ్చ మే మతిశ్చమే సుమతిశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 11

ఓమ్ వ్రీహయశ్చ మే యవాశ్చ మే మాషాశ్చమే తిలాశ్చ మే ముద్గాశ్చ మే ఖల్వాశ్చ మే ప్రియఙ్గవశ్చ మే2ణవశ్చమే, శ్యామాకాశ్చ మే నీవారాశ్చ మే గోధూమాశ్చ మే మసూరాశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 12

ఓమ్ అశ్మా చ మే మృత్తికా చ మే గిరియశ్చ మే పర్వతాశ్చ మే సికతాశ్చ మే వనస్పతయశ్చ మే హిరణ్యం చ మే2యశ్చ మే శ్యామం చ మే లోహంచ మే సీసం చ మే త్రపు చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 13

ఓమ్ అగ్నిశ్చ మ ఆపశ్చ మే వీరుధశ్చ మ2ఓషధయశ్చ మే కృష్టపచ్యాశ్చ మే2కృష్టపచ్యాశ్చ మే, గ్రామ్యాశ్చ మే పశవ ఆరణ్యాశ్చ మే విత్తఞ్చ మే విత్తిశ్చ మే భూతఞ్చ మే భూతిశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 14

ఓమ్ వసు చ మే వసతిశ్చ మే కర్మ చ మే శక్తిశ్చ మే2ర్థశ్చ మ ఏమశ్చ మ2ఇత్యా చమే । గతిశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 15

ఓమ్ అగ్నిశ్చమ2ఇన్ద్రశ్చ మే సోమశ్చ మ2ఇన్ద్రశ్చ మే సవితా చ మ2 ఇన్ద్రశ్చ మే సరస్వతీ చమ2ఇన్ద్రశ్చమే, పూషా చ మ ఇన్ద్రశ్చ మే బృహస్పతిశ్చ మ ఇన్ద్రశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 16

ఓమ్ మిత్రశ్చ మ ఇన్ద్రశ్చ మే వరుణశ్చ మ ఇన్ద్రశ్చ మే ధాతా చ మ ఇన్ద్రశ్చ మే త్వష్టా చ మ ఇన్ద్రశ్చ మే, మరుతశ్చ మ ఇన్ద్రశ్చ మే, మరుతశ్చ మ ఇన్ద్రశ్చ మే, విశ్వే చ మే దేవా ఇన్ద్రశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 17

ఓమ్ పృథివీ చ మ ఇన్ద్రశ్చమే2న్తరిక్షం చ మ ఇన్ద్రశ్చమే ద్యౌశ్చ మ ఇన్ద్రశ్చ మే సమాశ్చ మ ఇన్ద్రశ్చ మే, నక్షత్రాణి చ మ ఇన్ద్రశ్చ మే దిశశ్చ మ ఇన్ద్రశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 18

ఓమ్ అంశుశ్చ మే రశ్మిశ్చ మే2దాభ్యశ్చ మే2ధిపతిశ్చ మ ఉపాంశుశ్చ మే2న్తర్యామశ్చ మ ఐన్ద్రవాయవశ్చ మే, మైత్రా వరుణశ్చ మ ఆశ్వినశ్చ మే ప్రతిప్రస్థానశ్చ మే, శుక్రశ్చ మే మన్థీ చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 19

ఓమ్ ఆగ్రయణశ్చ మే వైశ్వదేవశ్చ మే ధ్రువశ్చ మే వైశ్వానరశ్చ మ ఐన్ద్రాగ్నశ్చమే, మహావైశ్వదేవశ్చ మే మరుత్వ తీయాశ్చ మే నిష్కేవల్యశ్చ మే సావిత్రశ్చ మే సారస్వతశ్చమే, పాత్నీవతశ్చ మే హారియోజనశ్చమే యజ్ఞేన కల్పన్తామ్॥ 20

ఓమ్ స్రుచశ్చ మే చమసాశ్చ మే వాయవ్యాని చ మే ద్రోణకలశశ్చ మే గ్రావాణశ్చ మే2ధిషవణే చ మే, పూతభృచ్చ మ ఆధవనీయశ్చ మే వేదిశ్చమే బర్హిశ్చ మే2వభృథశ్చ మే స్వగాకారశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 21

ఓమ్ అగ్నిశ్చ మే ఘర్మశ్చ మే2ర్కశ్చ మే సూర్యశ్చ మే ప్రాణశ్చ మే2శ్వమేధశ్చ మే పృథివీ చ మే దితిశ్చ మే2దితిశ్చ మే, ద్యౌశ్చ మే2ఙ్గులయఃశక్వరయో దిశశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 22

ఓమ్ వ్రతం చ మ ఋతవశ్చ మే తపశ్చ మే సంవత్సరశ్చ మే2హోరాత్రే ఊర్వష్ఠీవే బృహద్రథన్తరే చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 23

ఓమ్ ఏకాచమే తిస్రశ్చ మే తిస్రశ్చ మే పంచచమే పంచచమే సప్తచమే సప్తచమే నవచమే నవచమ ఏకాదశమ ఏకాదశచమే, త్రయోదశచమే త్రయోదశచమే పంచదశచమే పంచదశచమే సప్తదశచమే సప్తదశచమే నవదశచమే నవదశచమ ఏకవింశతిశ్చమే ఏకవింశతిశ్చమే త్రయోవింశతిశ్చమే త్రయోవింశతిశ్చమే పంచవింశతిశ్చమే, పంచవింశతిశ్చమే సప్తవింశతిశ్చమే సప్తవింశతిశ్చమే నవవింశతిశ్చమే నవవింశతిశ్చమ ఏకత్రింశచ్చమ ఏకత్రింశచ్చమే త్రయస్త్రింశచ్చమే యజ్ఞేన కలన్తామ్॥ 24

ఓమ్ చతస్రశ్చమే2ష్టాచమే2ష్టాచమే ద్వాదశచమే ద్వాదశచమే షోడశచమే షోడశచమే వింశతిశ్చమే, వింశతిశ్చమే చతుర్వింశతిశ్చమే చతుర్వింశతిశ్చమే2ష్టా వింశతిశ్చమే2ష్టావింశతిశ్చమే ద్వాత్రింశచ్చమే, ద్వాత్రింశచ్చమే షట్త్రింశచ్చమే షట్త్రింశచ్చమే చత్వారింశచ్చమే చత్వారింశచ్చమే చతుశ్చత్వారింశచ్చమే చతుశ్చత్వారింశచ్చమే2ష్టా చత్వారింశచ్చమే యజ్ఞేన కల్పన్తామ్॥ 25

ఓమ్ త్ర్యవిశ్చమే త్ర్యవీచమే దిత్యవాట్చమే దిత్యౌహీచమే పఞ్చావిశ్చమే పఞ్చావీచమే, త్రివత్సశ్చమే త్రివత్సాచమే తుర్యవాట్చమే తుర్యౌహీచమే యజ్ఞేన కల్పనామ్॥ 26

ఓమ్ షష్ఠవాట్చమే షష్ఠౌహీచమ ఉక్షాచమే వశాచమ2ఋషభశ్చమే వేహచ్చమే 2నడ్వాం శ్చమే ధేనుశ్చమే యజ్ఞేన కల్పన్తామ్॥ 27

ఓమ్ వాజాయస్వాహా ప్రసవాయస్వాహా పిజాయస్వాహా క్రతవేస్వాహా వసవేస్వాహా2హర్పతయే స్వాహాహ్నే ముగ్ధాయస్వాహా ముగ్ధాయ వైనంశినాయ స్వాహా వినంశిన ఆన్త్యాయనాయ స్వాహాన్త్యాయ భౌవనాయస్వాహా భువనస్య పతయే స్వాహాధిపతయే స్వాహా ప్రజాపతయే స్వాహా, ఇయం తే రాణ్మిత్రాయ యన్తాసి యమన ఊర్జేత్వా వృష్టే త్వా ప్రజానాం త్వాధిపత్యాయ॥ 28

ఓమ్ ఆయుర్యజ్ఞేన కల్పతాం ప్రాణో యజ్ఞేన కల్పతాం చక్షుర్యజ్ఞేన కల్పతాం, శ్రోత్రం యజ్ఞేన కల్పతాం వాగ్యజ్ఞేన కల్పతాం మనోయజ్ఞేన కల్పతామాత్మా యజ్ఞేన కల్పతాం బ్రహ్మాయజ్ఞేన కల్పతాం జ్యోతిర్యజ్ఞేన కల్పతాం, స్వర్యజ్ఞేన కల్పతాం పృష్ఠం యజ్ఞేన కల్పతాం యజ్ఞో యజ్ఞేన కల్పతామ్। స్తోమశ్చ యజుశ్చ ఋక్ చ సామచ బృహచ్చ రథన్తరంచ। స్వర్దేవా అగన్మామృతా అభూమ ప్రజాపతేః ప్రజా అభూమ వేట్ స్వాహా॥ 29

ఓమ్ వాజస్య ను ప్రసవే మాతరం మహీమదితి న్నామ వచసా కరామహే, యస్యామిదం విశ్వం భువనమావివేశ తస్యాన్నో దేవః సవితా ధర్మసావిషత్॥ 30

ఓమ్ విశ్వే2అద్య మరుతో విశ్వ2ఊతీ భవన్త్వగ్నయః సమిద్ధాః। విశ్వేనో2దేవా అవసాగమన్తు విశ్వమస్తు ద్రవిణం వాజో2అస్మే॥ 31

ఓమ్ వాజో నః సప్త ప్రదిశశ్చతస్రో వా పరావతః। వాజో నో విశ్వైర్దేవైర్ధన సాతా విహావతు॥ 32

ఓమ్ వాజో నో2ద్య ప్రసువాతి దానం వాజో దేవాన్2 ఋతుభిః కల్పయాతి,
వాజో హి మా సర్వవీరం జజాన విశ్వా ఆశా వాజపతిర్జయేయమ్॥ 33

ఓమ్ వాజః పురస్తాదుత మధ్యతో నో వాజో దేవాన్ హవిషా వర్ధయాతి ।
వాజో హి మా సర్వవీరం చకార సర్వా2ఆశా వాజపతిర్భవేయమ్॥ 34

ఓమ్ సం మా సృజామి పయసా పృథివ్యాః సం మా సృజామ్యద్భిరోషధీభిః
సో హం వాజం సనేయ మగ్నే॥ 35

ఓమ్ పయః పృథివ్యాం పయ ఓషధీషు పయో దివ్యన్తరిక్షే పయో ధాః
పయస్వతీః ప్రదిశః సన్తు మహ్యమ్॥ 36

ఓమ్ దేవస్య త్వా సవితుః ప్రసవే2శ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్।
సరస్వత్యై వాచో యన్తుర్యన్త్రేణాగ్నేః సామ్రాజ్యేనాభి షిఞ్చామి॥ 37

ఓమ్ ఋతాషాడృత ధామాగ్నిర్గన్ధర్వస్త స్యౌషధయో2ప్సరసో ముదో నామ।
స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా॥ 38

ఓమ్ సంహితో విశ్వసామా సూర్యో గన్ధర్వ స్తస్య మరీచయో2ప్సరస ఆయువో
నామ । సన ఇదం బ్రహ్మ క్షత్రంపాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా॥
39

ఓమ్ సుషుమ్ణః సూర్యరశ్మిశ్చన్ద్రమా గన్ధర్వ స్తస్య నక్షత్రాణ్యప్సరసో భేకురయో నామ।
స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా॥ 40

ఓమ్ ఇషిరో విశ్వవ్యచా వాతో గన్ధర్వస్తస్యాపో అప్సరస ఊర్జో నామ ।
స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా॥ 41

ఓమ్ భుజ్యుః సుపర్ణో యజ్ఞో గన్ధర్వస్తస్య దక్షిణా అప్సరస స్తావా నామ ।
స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా॥ 42

ఓమ్ ప్రజాపతిర్విశ్వకర్మా మనో గన్ధర్వస్తస్య ఋక్సామాన్యప్సరస ఏష్టయో నామ।
స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా॥ 43

ఓమ్ స నో భువనస్యపతే ప్రజాపతే యస్యత ఉపరి గృహా యస్యవేహ।
అస్మై బ్రహ్మణే2స్మై క్షత్రాయ మహి శర్మ యచ్ఛ స్వాహా॥ 44

ఓమ్ సముద్రో2సి నభస్వానార్ద్రదానుః శమ్భూర్మయో భూరభి మా వాహి స్వాహా
మారుతో2సి మరుతాం గణః శమ్భూర్మయోభూరభి మా వాహి స్వాహా,
అవస్యూరసి దువస్వాఞ్ఛ మ్భూర్మయోభూరభి మా వాహి స్వాహా॥ 45

ఓమ్ యాస్తే అగ్నే సూర్యే రుచో దివమాతన్వన్తి రశ్మిభిః।
తాభిర్నో అద్య సర్వాభీరుచే జనాయ నస్కృధి॥ 46

ఓమ్ యా వో దేవాః సూర్యే రుచో గోష్వశ్వేషు యా రుచః।
ఇన్ద్రాగ్నీ తాభిః సర్వాభీ రుచం నో ధత్త బృహస్పతే॥ 47

ఓమ్ రుచం నో ధేహి బ్రహ్మణేషు రుచం రాజసు నస్కృధి।
రుచం విశ్యేషు శూద్రేషు మయిధేహి రుచా రుచమ్॥ 48

ఓమ్ తత్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః
అహేడమానో వరుణేహ బోధ్యురుశం స మాన ఆయుః ప్రమోషీః॥ 49

ఓమ్ స్వర్ణ ఘర్మః స్వాహా స్వర్ణార్కః స్వాహా స్వర్ణ శుక్రః స్వాహా
స్వర్ణ జ్యోతిః స్వాహా స్వర్ణ సూర్యః స్వాహా॥ 50

ఓమ్ అగ్నిం యునజ్మి శవసా ఘృతేన దివ్యం సువర్ణం వయసా బృహన్తమ్। తేన
వయం గమేమ బ్రధ్నస్య విష్టపం స్వా రుహాణా అధి నాకముత్తమమ్ 51

ఓమ్ ఇమౌ తే పక్షావజరౌ పతత్రిణౌ యాభ్యాం రక్షాం స్యపహం స్యగ్నే। తాభ్యాం
పతేమ సుకృతాము లోకం యత్ర ఋషయో జగ్ముః ప్రథమజాః పురాణాః
52

ఓమ్ ఇన్దుర్దక్షః శ్యేన ఋతావా హిరణ్యపక్షః శకునో భురణ్యుః।
మహాన్సదస్థే ధ్రువ ఆ నిషత్తో నమస్తే అస్తు మా మా హింసీః॥ 53

ఓమ్ దివో మూర్ధాసి పృథివ్యా నాభిరూర్గపామోషధీనామ్।
విశ్వాయుః శర్మ సప్రథానమస్పథే॥ 54

ఓమ్ విశ్వస్య మూర్ధన్నధి తిష్ఠసి శ్రితః సముద్రేతే హృదయమస్వ్స్వా యురపోదత్తో
దధింభిన్త । దివస్పర్జన్యాదన్తరిక్షాత్ పృథివ్యాస్తతో నో వృష్ట్యావ॥ 55

ఓమ్ ఇష్టో యజ్ఞో భృగుభిరాశీర్దా వసుభిః తస్య న ఇష్టస్య ప్రీతస్య ద్రవిణే హాగమేః॥ 56

ఓమ్ ఇష్టో అగ్నిరాహుతః పిపర్తు న ఇష్టం హవిః స్వగేదం దేవేభ్యో నమః॥ 57

ఓమ్ యదాకూతాత్సమసుస్రో ద్ధృదోవా మనసో వా సంభృతం చక్షుషో వా తదను
ప్రేత సుకృతాము లోకం యత్ర ఋషయో జగ్ముః ప్రథమజాః పురాణాః॥58

ఓమ్ ఏతం సధస్థ తే దధామి యమావహాచ్ఛేవధిం జాతవేదాః।
అన్వాగన్తా యజ్ఞపతిర్వో అత్ర తం స్మ జానీత పరమే వోమన్॥ 59

ఓమ్ ఏతం జానాథ పరమే వ్యోమన్ దేవాః సధస్థా విద రూపమస్య యదాగచ్ఛాత్
పథిభిర్దేవయానై రిష్టాపూర్తే కృణవాథావి రస్మై॥ 60

ఓమ్ ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహి త్వమిష్టా పూర్తే సం సృజేథామయం చ,
అస్మిన్సధస్థే అధ్యుత్తరస్మిన్ విశ్వే దేవా యజమానశ్చ సీదత॥ 61

ఓమ్ యేన వహసి సహస్రం యేనాగ్నే సర్వవేదసమ్।
తేనేమం యజ్ఞం నో నయ స్వర్దేవేషు గన్తవే॥ 62

ఓమ్ ప్రస్తరేణ పరిధినా స్రుచా వేద్యా చ బర్హిషా। ఋచేమం యజ్ఞం నో నయ
స్వర్దేవేషు గన్తవే॥ 63

ఓమ్ యద్దత్తం యత్పరాదానం యత్పూర్తం యాశ్చ దక్షిణాః।
తదగ్ని ర్వైశ్వకర్మణః స్వర్దేవేషు నో దధత్॥ 64

ఓమ్ యత్ర ధారా అనపేతా మధోర్ఘృతస్య చ యాః।
తదగ్ని ర్వైశ్వ కర్మణః స్వర్దేవేషు నో దధత్॥ 65

ఓమ్ అగ్నిరస్మి జన్మనా జాతవేదా ఘృతం మే చక్షురమృతం మ ఆసన్,
అర్కస్త్రిధాతూ రజసో విమానో2జ స్రో ఘర్మో హవిరస్మి నామ॥ 66

ఓమ్ ఋచో నామాస్మి యజూంషి నామాస్మి సామాని నామాస్మి। యే అగ్నయః
పాఞ్చజన్యా అస్యాం పృథివ్యామధి।
తేషామసి త్వముత్తమః ప్ర నో జీవాతవే సువ॥ 67

ఓమ్ వార్త్రహత్యాయ శవసే పృతనాషాహ్యాయ చ। ఇన్ద్ర త్వావర్తయామసి 68

ఓమ్ సహదాను మ్పురుహూత క్షియన్త మహస్త మిన్ద్ర సంపిణక్ కుణారుమ్,
అభివృత్రం వర్ధమానం పియారుమపాదమిన్ద్ర తవసా జఘన్థ॥ 69

ఓమ్ విన ఇన్ద్ర మృధో జహి నీచా యచ్ఛ పృతన్యతః,
యో అస్మాన్ అభిదా సత్యధరం గమయా తమః॥ 70

ఓమ్ మృగో న భీమః కుచరో గిరిష్ఠాః పరావత ఆజగన్థా పరస్యాః।
సృకంసంశాయ పవిమిన్ద్ర తిగ్మం వి శత్రూన్తాఢి వి మృధో నుదస్వ॥ 71

ఓమ్ వైశ్వానరో న ఊతయ ఆ ప్రయాతు పరావతః। అగ్నిర్నః సుష్టుతిరుప॥ 72

ఓమ్ పృష్టోదివి పృష్టో అగ్నిః పృథివ్యాం పృష్టో విశ్వా ఓషధీరావివేశ।
వైశ్వా నరః సహసా పృష్టో అగ్నిః సనో దివా స రిషస్పాతు నక్తమ్॥ 73

ఓమ్ అశ్యామతం కామమగ్నే తవోతీ అశ్యామ రయిం రయివః సువీరమ్।
అశ్యామ వాజమభి వాజయన్తో2శ్యామ ద్యుమ్నమజరాజరం తే॥ 74

ఓమ్ వయం తే అద్య రరిమా హి కామముత్తానహస్తా నమసోపసద్య।
యజిష్ఠేన మనసా యక్షి దేవానస్రేవధతా మన్మనా విప్రో2అగ్నే॥ 75

ఓమ్ ధామచ్ఛదగ్నిరిన్ద్రో బ్రహ్మా దేవో బృహస్పతిః।
సచేతసో విశ్వే దేవా యజ్ఞం ప్రావన్తు నః శుభే॥ 76

ఓమ్ త్వం యువిష్ఠ దాశుషో నౄన్ః పాహి శృణుధీ గిరః।
రక్షా తోక ముత త్మనాః॥ 77

ఇత్యష్టాదశో2ధ్యాయః



# 7. భగవత్ సూక్తము

## యజుర్వేదము 32 వ అధ్యాయము
## 16 మంత్రములు - సంక్షిప్త వ్యాఖ్యానము

భగవంతుడు సచ్చిదానంద స్వరూపుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సనాతనుడు, నిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడు, అనాది అనంతుడు, న్యాయకారి, దయాళువు, నాశరహితుడు, ధారణకర్త, అంతర్యామి, ముక్త స్వభావుడు, అనంత జ్ఞానస్వరూపుడు, ఆదిత్యుడు, ఆనంద స్వరూపుడు. ప్రజాపతి జగత్ప్రభువని మానవులందరు ఆ పరమపురుషుని తెలుసుకోవాలి. కాలానికి అవయవాలను నిర్మించిన పరబ్రహ్మ అంతటా నిండి యున్నాడు. భూత భవిష్యత్ వర్తమాన కాలాలు ఆ కాలపురుషుని అధీనంలోనే ఉన్నాయి. ఆ జగదీశ్వరునకు హద్దులు లేవు. ఆయనకు దేహము లేదు. ఆ పరమాత్మనే మానవులందరు ఉపాసించాలి. ఈ భగవత్ లక్షణాలకు విరుద్ధంగా ఉన్న వారిని దైవంగా భావించి ఉపాసించకూడదు. 'మహతీ వినష్టిః' వారికి గొప్ప నష్టము కలుగుతుందని ఉపనిషత్‌కారులు ఘోషిస్తున్నారు.

భగవంతుడు సమస్త ప్రాణుల హృదయములందు స్థిరముగా వున్నాడు. ధ్యానశీలురైన యోగులు మాత్రమే పరమపురుషుని దర్శించగలరు. మానవులు చేయు శుభాశుభకర్మలకు భగవంతుడే పర్యవేక్షకుడు. ఆయనే సమస్త ప్రాణులకు న్యాయము చేయగలడు. ప్రాణాది షోడశ పదార్థాలను ఆయనే సృజించాడు. అందుకే ఆయన **'షోడశి'**యని పిలువబడుచున్నాడు. ఆకాశాది మహత్ పదార్థాలకు ఆధారమైన

ఆ పరమాత్మనే బుద్ధిమంతులు తెలుసుకోవాలి. ఆ సుఖప్రదాతనే భక్తి శ్రద్ధలతో భజించాలి. ఉపాసించాలి. మానవులు ధర్మాచరణము వేదాభ్యాసము యోగాభ్యాసము సత్సంగము సత్య భాషణాదులచే పరమాత్మను దర్శించగలరు.

మానవులు నిరంతరము పరమేశ్వర ఆజ్ఞలను పాలించాలి. వేదవిదులైన విద్వాంసుల సేవలో తరించాలి. ఉత్తమ విద్యలతో సద్గుణములతో లోకంలో కీర్తిని పొందాలి. వారే అందరిచే పూజింప యోగ్యులు, సర్వశ్రేష్ఠులు.

## అథ భగవత్ సూక్తమ్
## ఇదం భగవతే ఇదం న మమ

ఓమ్ తదేవాగ్నిస్తదాదిత్యస్తద్వాయుస్తదు చన్ద్రమాః।
తదేవ శుక్రం తద్ బ్రహ్మా తా ఆపః స ప్రజాపతిః॥ 1

ఓమ్ సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి ।
నైనమూర్ధ్వం న తిర్యఞ్చం న మధ్యే పరి జగ్రభత్॥ 2

ఓమ్ న తస్య ప్రతిమా అస్తి యస్య నామ మహద్యశః।
హిరణ్యగర్భ ఇత్యేష మా మాహింసీ దిత్యేషా యస్మాన్నజాత ఇత్యేషః॥ 3

ఓమ్ ఏషో హ దేవః ప్రదిశోఽ2ను సర్వాః పూర్వో హ జాతః స ఉం గర్భే అన్తః । స
ఏవ జాతః స జనిష్యమాణః ప్రత్యఙ్ జనాస్తిష్ఠతి సర్వతో ముఖః॥ 4

ఓమ్ యస్మాజ్జాతం న పురా కిం చనైవ య ఆబభూవ భువనాని విశ్వా॥ ప్రజాపతిః
ప్రజయా సంరరాణ స్త్రీణి జ్యోతీంషి సచతే స షోడశీ॥ 5

ఓమ్ యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా యేన స్వ స్తభితం యేన నాకః। యో అన్తరిక్షే
రజసో విమానః కస్మై దేవాయ హవిషా విధేమ॥ 6

ఓమ్ యం క్రన్దసీ అవసా తస్తభానే అభ్యైక్షేతాం మనసా రేజమానే ।
యత్రాధి సూర ఉదితో విభాతి కస్మై దేవాయ హవిషా విధేమ ।
ఆపో హ యద్ బృహతీర్యశ్చిదాపః ॥ 7

ఓమ్ వేనస్త త్పశ్యన్నిహితం గుహా సద్యత్ర విశ్వం భవత్యేక నీడమ్ ।
తస్మిన్ని దంసం చ వి చైతి సర్వం స ఓతః ప్రోతశ్చ విభూః ప్రజాసు ॥ 8

ఓమ్ ప్రతద్వోచేదమృతం ను విద్వాన్ గన్ధర్వో ధామ విభృతం గుహా సత్ ।
త్రీణి పదాని నిహితా గుహాస్య యస్తాని వేద స పితుః పితాసత్ ॥ 9

ఓమ్ స నో బన్ధుర్జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా
యత్ర దేవా అమృతమానశానా స్తృతీయే ధామ న్న ధ్యైరయన్త॥ 10

ఓమ్ పరీత్య భూతాని పరీత్య లోకాన్ పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ।
ఉపస్థాయ ప్రథమ జామృతస్యాత్మ నాత్మాణ మభి సం వివేశ॥ 11

ఓమ్ పరి ద్యావాపృథివీ సద్య ఇత్వా పరి లోకాన్ పరి దిశః పరిస్వః।
ఋతస్య తన్తుం వితతం విచృత్య తదపశ్య త్తదభవత్తదాసీత్॥ 12

ఓమ్ సదసస్పతి మద్భుతం ప్రియమిన్ద్రస్య కామ్యమ్।
సనిం మేధామయాసిషం స్వాహా॥ 13

ఓమ్ యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతే।
తయా మా మద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా ॥ 14

ఓమ్ మేధాం మే వరుణో దదాతు మేధామగ్నిః ప్రజాపతిః।
మేధామిన్ద్రశ్చ వాయుశ్చ మేధాం ధాతా దదాతు మే స్వాహా॥ 15

ఓమ్ ఇదం మే బ్రహ్మాచ క్షత్రం చోభే శ్రియమశ్నుతామ్।
మయి దేవా దధతు శ్రియముత్తమాం తస్యై తే స్వాహా॥ 16

ఇతి ద్వాత్రింశో2ధ్యాయః





## 8. భక్తి-ఉపాసనా సూక్తము

### సామవేదము

### 26 మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము

సర్వజ్ఞుడైన పరమాత్ముని వేదవాణి భగవద్భక్తుల హృదయములలో అలౌకికమైన ఆనందరసాన్ని కలిగిస్తుంది. వారిలోని అజ్ఞానాంధకారం తొలగి పరంజ్యోతి - భగవత్ ప్రకాశముగా గోచరిస్తుంది. నిష్కామ భావముతో సత్కర్మలను ఆచరించుట వలన ఉపాసకులు యోగులై పూర్ణ పురుషుని పొందగలరు. సాధకుల భక్తి జ్ఞాన కర్మ రూపయజ్ఞములనే తపస్సును పూర్ణము చేయువాడు ఆ పరమపురుషుడే. ముక్తి ఫలమును ప్రసాదించువాడు కైవల్య ప్రదాతయైన ఆ పరంధాముడొక్కడే. చరాచర జగత్తులోని సమస్త ప్రాణుల మేలు కోరు (వాడు) ఆ పరబ్రహ్మ జగత్ స్రష్ట ఒక్కడే. పరమేశ్వరోపాసనే మానవులు సర్వోత్తమ తపస్సుగా భావించాలి.

భగవంతుడు సర్వభూత హితుడు. సమస్త ప్రాణుల రక్షకుడు, పోషకుడు. పరమాత్మునితో నే మనకు గాఢమైన అనుబంధముంది. దయామయుడైన ఆ దేవదేవుడు సర్వకాలములలో మన హితమునే కాంక్షించును. అందుకే మానవులందరు సమర్పిత భావముతో సర్వదా శుభకర్మలు ఆచరించి ఆ పుణ్య ఫలమును లోక పూజ్యానకు అర్పణ చేయవలయును.

పరమాత్ముడు పరిపూర్ణుడు. ఈ జగత్తు సంపూర్ణము. ఈ సంపూర్ణ జగత్తులో ప్రతి అణువులో పరమాత్ముడు నిండియున్నాడు. ఆ పరమాత్ముని మంగళప్రదమైన ఈ సమస్త విశ్వాన్ని మానవులు దర్శించి, స్మరించి



తరించాలి. బ్రహ్మజ్ఞానుల హృదయములందు సర్వదా విరాజిల్లువాడు పరమాత్ముడు. సత్పురుషుల దుఃఖములను నాశనము చేయువాడు ఆ పరమపురుషుడే. సమస్త లోకాలను భువనాలను - బ్రహ్మాండాన్ని ప్రకాశింపచేయువాడు ఆ వేదవేద్యుడే. కైవల్య ప్రదాతయైన ఆ పరమాత్ముడే మా హృదయాంతరాలయములందు సర్వదా భాసిల్లుగాక!

ధర్మానుష్ఠాన తత్పరులైన సజ్జనుల మనోభీష్టములను పరమాత్ముడు ఫలింపచేయును. భగవంతుని మహిమలతో భక్తుని హృదయము పరవశించును. ప్రకృతిలోని పార్థివ పదార్థాలను భగవంతునిగ భావించి పూజించకూడదు. నిరంతరము ఈశ్వరాన్వేషకులు జగత్ కల్యాణస్రష్టయైన పరమాత్ముని దర్శించి ఆ స్వామినే శ్రద్ధతో ఉపాసింతురు. ఋగ్వేదాది చతుర్వేదములకు ఆధారము విశ్వాత్ముడైన వేదవేద్యుడే. భగవద్వాణియైన వేదమే విశ్వములోని సర్వధర్మములకు సకల విద్యలకు మూలము. వేదస్తుతివలన భక్తులు దైవత్వమును పొంది అపరాజితులై లోకములో సదా విజయమును వరించగలరు. మానవాళి అనుసరించాల్సిన ధర్మకర్మలకు వేదమే నిలయము. మనోవాక్కాయకర్మలతో సత్య ధర్మములను పాలించువారు ముముక్షువులై ముక్తిని పొందగలరు.

పరంధాముని దివ్యకావ్యము వేదము. సర్వశ్రేష్ఠమైన జ్ఞానము ప్రజ్ఞా సర్వస్వము వేదమే. సమస్త మానవ జాతి కల్యాణాన్ని ఆశించడము మానవులకు మహాయజ్ఞముతో సమానము. అందులో అందరి సేవాహుతులుండాలి. మానవ జీవన సాఫల్యమునకు బ్రహ్మచర్యము వేదాధ్యయనము ఈశ్వరోపాసన ధర్మానుష్ఠానము - తపస్సు మొదలైన శుభకర్మలను శ్రద్ధతో అనుష్ఠించాలి. పరుల మేలుకై లోకకల్యాణాన్ని ఆశించి ధర్మకర్మలు ఆచరించాలి.



హే! దేవదేవా! నా జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనస్సు, హృదయము, ఆత్మ నిర్మలము స్వచ్ఛమై పరులయందు ప్రేమతో పరమాత్ముని యందు భక్తిరసముతో నిండియుండును గాక! ఈ సద్గుణములు కలిగినవారే భగవదనుగ్రహమునకు పాత్రులగుదురు గాక! పరమాత్ముడే తల్లితండ్రి, గురువు, దైవము. అక్షరాభ్యాసమునకు ఆది కావ్యము వేదమే.

వివేకవంతుడు - విజ్ఞుడు ముందుగా తనలోని అసూయా రాగద్వేషాలను - అరిషడ్వర్గములనే అసుర సముదాయమును పారద్రోలవలయును. ప్రేమతో కామాన్ని జయించాలి. కారుణ్య భావముతో క్రోధాన్ని అధిగమించాలి. దాతృత్వముతో లోభాన్ని త్యజించాలి. త్యాగముతో మోహాన్ని విడిచిపెట్టాలి. వినయముతో మదమును అహంకారమును అణచివేయాలి. ఆనందముతో మత్సరాన్ని - అసూయను తొలగించుకోవాలి. సద్గుణాలతో అసురగుణాలపై మానవుడు సర్వదా విజయాన్ని సాధించాలి. బుద్ధిమంతుడు ప్రతి అంశాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తాడు. లలితమైన భావనలతో జీవిస్తాడు. వేదమాతను పూజిస్తాడు. సత్యమునే వచిస్తాడు. సర్వదా సర్వోపరి విరాజిల్లే ఆ వేదవేద్యునే ఉపాసిస్తాడు.

మన హృదయాలలో జ్ఞానజ్యోతిని వెలిగించేది పరమాత్ముడే. పరమాత్ముడు అద్వితీయుడు. లోకోత్తర మహిమాన్వితుడు. సమస్త ప్రాణులయందు అంతర్యామి రూపంలో రహస్యంగా దాగియున్నాడు. వేదవేద్యుడు కర్మఫలప్రదాత సర్వజ్ఞుడు సర్వసాక్షి, జ్ఞానస్వరూపుడు, సగుణుడు, నిర్గుణుడు, చైతన్య స్వరూపుడు, సమస్త సత్య, జ్ఞాన విద్యలకు భగవంతుడే ఆధారం.

భక్తుడు బ్రహ్మోపాసకుడు కావాలి. వేదవిదుల మంగళ వచనాలు

వినాలి. పరమాత్ముని అద్భుత సృష్టి రచన విశేషాలను తెలుసుకోవాలి. పరులకొరకై తన మాన ధనములను అర్పించాలి. మనో సంకల్పము శుభంకరమైనదిగా వుండాలి. సుఖశాంతులతో జీవించాలి. వైదిక మర్యాదలను పాలించాలి. న్యాయముగా ధన ధాన్యములను సంపాదించాలి. సంతృప్తిగా జీవించాలి. పరాత్పరుని సేవించాలి. మానవులు ప్రసిద్ధ, శుభంకరమైన ఈ సుభాషితములను సర్వదా ఆలంకించాలి. సామవేదవాణి మంజుల రూపమై మనోజ్ఞమై మనసును పరవశింపచేయాలి. ఈ వేదగానము సదా సర్వదా స్తుతిదాయకమగునుగాక!

జ్ఞాన కర్మ ఉపాసనలనెడి త్రివేణీ సంగమములో ప్రణవోపాసన చేయుచూ దివ్యము భవ్యమైన జీవనమును గడుపుదుము గాక! మోక్షానందమునకై సామవేద రసమును రసాస్వాదన చేయుదుముగాక!

సామవేదంలోని సామగానం జీవితాన్ని ఆధ్యాత్మిక ఆనందం వైపు నడిపిస్తుంది. అంటే మనోహరమైన అంతర్ధ్వనులతో మనలను పరవశింపచేస్తాయి. అసంఖ్యాక గుణ విభూషితుడైన పరమాత్మను జీవాత్మ దర్శించాలి. అదే సామ - వేదముల పూర్ణ ప్రయోజనం.

## అథ సామవేదః

## ఇదం అగ్నయే ఇదం న మమ

1. ఓమ్ అగ్న ఆయాహి వీతయే గృణానోహవ్య దాతయే । నిహోతా సత్సిబర్హిషి॥ (1)

2. ఓమ్ త్వమగ్నే యజ్ఞానాం హోతా విశ్వేషాంహితః। దేవేభిర్మానుషే జనే॥ (2)

3. ఓమ్ అగ్నిం దూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్। అస్య యజ్ఞస్య సుక్రతుమ్॥ (3)

4. ఓమ్ ఏహ్యూ బ్రవాణితే2గ్న ఇత్థేతరాగిరః। ఏభిర్వర్ధాస యిందుభిః॥ (7)

5. ఓమ్ అతీవత్సో మనోయమత్ పరిమాచ్చిత్ సదస్థాత్ । అగ్నేత్వాం కామయేగిరా॥(8)

6. ఓమ్ నమస్తే అగ్న ఓజసే గృణంతి దేవ కృష్టయః॥ అమైరమిత్ర మర్దయ॥ (11)

7. ఓమ్ ఉదుత్యం జాతవేదసం దేవం వహంతి కేతవః॥ దృశే విశ్వాయ సూర్యమ్॥ (31)

8. ఓమ్ శం నో దేవరభిష్టయే శంనో భవంతు పీతయే శంయోరభిస్రవంతునః॥ (33)

9. ఓమ్ ఈడిష్వా హిప్రతీవ్యాం2యజస్వ జాతవేదసమ్ । చరిష్ణు ధూమమగృభీత శోచిష్యమ్॥ (103)

10. ఓమ్ ఉపహ్వరే గిరీణాం సంగమే చ నదీనాం। ధియా విప్రో అజాయత ॥ (143)

11. ఓమ్ సదసస్పతి మద్భుతం ప్రియ మింద్రస్య కామ్యమ్ । సనిం మేధామయాసిషమ్॥ (171)

12. ఓమ్ నకిదేవా ఇనీమసి నక్యాయో పయా మసి । మంత్రశ్రుత్యం చరామసి॥ (176)

13. ఓమ్ ప్రేహ్యా భీహి ధృష్ణుహి నతే వజ్రో నియంసతే । ఇంద్రనృమ్ణంహితే
శవోహనో వృత్రం జయా అపోర్చన్నను స్వరాజ్యమ్॥ (413)

14. ఓమ్ అగ్నేత్వం నో అంతమ ఉతత్రాతా శివో భువోవరూథ్యః॥ (448)

15. ఓమ్ అగ్నిరస్మి జన్మనా జాతవేదా ఘృతం మే చక్షురమృతం మ ఆసన్।
త్రిధాతురర్కో రజసో విమానో2జస్రం జ్యోతిర్హ విరస్మి సర్వమ్॥ (613)

16. ఓమ్ వసంత ఇన్నురన్త్యో గ్రీష్మ ఇన్ను రన్త్యః॥
వర్షాణ్యను శరదో హేమంతః శిశిరః ఇన్నురన్త్యః॥ (616)

17. ఓమ్ చిత్రం దేవానా ముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః॥
ఆప్రా ద్యావా పృథివీ అంతరిక్షం సూర్య ఆత్మా జగతస్త స్థుషశ్చ॥ (629)

18. ఓమ్ స నః పవస్వ శంగవే శంజనాయ శమర్వతే । శం రాజన్నోషధీభ్యః॥ (653)

19. ఓమ్ పవస్వ వాచో అగ్రియః సోమ చిత్రాభిరూతిభిః॥ అభివిశ్వానికావ్యా॥ (775)

20. ఓమ్ జుష్ట ఇంద్రాయ మత్సరః పవమానః కనిక్రదత్ । విశ్వా అపద్విషో జహి॥ (1194)

21. ఓమ్ ఆపోహిష్ఠా మయోభువ స్తాన ఊర్జే దధాతన మహేరణాయ చక్షసే।
యోవః శివతమో రసస్తస్య భాజయతే హ నః ఉశతీరివమాతరః॥
తస్మా అరంగమామవోయస్యక్షయాయ జిన్వథ ఆపోజనయథాచనః॥ (1837, 38, 39)

22. ఓమ్ ఉతవాత పితాసి న ఉతభ్రాతో తనః సఖా। సనో జీవాతవే కృధి॥ (1841)

23. ఓమ్ యోనః స్వో2రణోయశ్చ నిష్ట్యో జిఘాంసతి దేవాస్తం సర్వే ధూర్వన్తు బ్రహ్మావర్మ మమాం తరం శర్మవర్మ మమాంతరమ్॥ (1872)

24. ఓమ్ మృగోన భీమః కుచరోగిరిష్ఠాః
పరావత ఆజగంథా పరస్యాః॥
సృకం సంశాయ పవిమింద్ర తిగ్మం విశత్రూన్ తాఢి
విమృథో నుదస్వ (1873)

25 ఓమ్ భద్రం కర్ణేభిః శృణుయామ దేవా
భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః॥
స్థిరైరంగైస్తువాసం సస్త నూభిర్వ్యశేమహి
దేవహితం యదాయుః॥ (1874)

26. ఓమ్ స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తి నః పూషా విశ్వవేదాః॥
స్వస్తినస్తార్ క్ష్యో అరిష్టనేమిః
స్వస్తినో బృహస్పతిర్దధాతు। (1875)



## 9. ఇంద్ర సూక్తము

### యజుర్వేదము 36 వ అధ్యాయము
### 24 మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము
### ఇంద్ర ఈశ్వర దేవతలు

మానవులు సమస్త సౌఖ్యములు ఆరోగ్యప్రదమైన దీర్ఘాయువును పొందుటకు విద్వాంసులకు వేదభగవానుడు ప్రబోధం చేస్తున్నాడు. మీ సాంగత్యమున ప్రశంసనీయమైన నా వేదవాణి ఋగ్వేదము, యజుర్వేదముతో సమానమైనది. పావనతరమైన మనస్సు, సామవేద సదృశమైనది ప్రాణము. సప్తదశ తత్త్వములతో సంయుక్తమైన సూక్ష్మశరీరము ఇవి ప్రమాదము అలసత్వము లేనివై సర్వశుభంకరములై సతతము ధర్మ కర్మలను చేయాలని విద్వాంసులకు ఈశ్వరోపదేశము. సమస్త మానవులను తరింపచేయు ధర్మము వేదవిద్వాంసులదేనని పరమాత్ముడు వారి కర్తవ్యమును ఈ సూక్తమున ఉపదేశించుచున్నాడు.

మానవులు అహింసా ధర్మమును స్వీకరించి జితేంద్రియులు కావలయును. పరమాత్మయందు ఆత్మను సం లగ్నము చేయవలయును. నాశరహితుడైన పరమాత్ముని యథార్థ స్వరూపమును గ్రహించి ధర్మార్థకామ మోక్షములను సాధింపవలయును. రాగద్వేషములు లేనివారై అజాత శత్రువులు కావలయును. సత్పురుషుల యెడల స్నేహ భావనను మిత్రత్వమును ఎన్నడు విడువకూడదు.

వేదానుష్ఠాన కర్తవ్య కర్మలైన పంచమహాయజ్ఞాదులను చేసి పంచభూతములను - దేవతలను శుద్ధము చేసిన మానవులకు భగవంతుడు సర్వదా సుఖామృతమును వర్షింపచేయును.

పృథివీ దేవత సమస్త ప్రాణులకు సుఖము ఐశ్వర్యములను ప్రసాదించినట్లే, సర్వశుభలక్షణ యుక్తయైన స్త్రీ విదుషీ పతివ్రతయై గృహధర్మాలను పాలిస్తూ భర్త మొదలైన బంధు బాంధవులకు సుఖశాంతులను ప్రసాదించాలి. పతిపత్నులు పరస్పరము అన్యోన్య అనురాగాలతో వర్ధిల్లుతూ శుభాచరణతో వర్తించాలి - జలముల వలె శాంతముగ గృహస్థ ధర్మంలో వ్యవహరించాలి. ప్రాణులన్నింటిని తన ఆత్మతో సమానంగా చూడాలి. ఎవరియందు ద్వేషభావం లేకుండా వుండాలి. అందరిని పవిత్ర దృష్టితో చూడాలి. వారే ధర్మాత్ములు.

మంగళ స్వరూపుడవై  హే పరబ్రహ్మ! మేము యుక్తాహార విహారములతో శతవర్షములు జీవించాలి. శతవర్షములు నిన్ను దర్శించాలి. శతవర్షములు శుభంకరములైన శాస్త్ర వచనములను వినాలి. ఆచరించాలి. శతవర్షములు ఇతరులచే చదివించాలి. మధురమైన సత్యవాణితో ఇతరులకు ఉపదేశించాలి. శత శరదృతువుల పర్యంతము దీనులము - పరాధీనులము కాకూడదు.

పరమేశ్వరాజ్ఞలను పాలిస్తూ స్వతంత్రులుగా జీవించునట్లు నీవు మమ్ములను అనుగ్రహింతువు గాక!

## అథ ఇంద్ర సూక్తమ్
## ఇదం ఇంద్రాయ ఇదం న మమ

ఓమ్ ఋచం వాచం ప్రపద్యే మనో యజుః ప్ర పద్యే సామ ప్రాణం ప్రపద్యే చక్షుః శ్రోత్రం ప్ర పద్యే । వాగోజః సహౌజో మయి ప్రాణాపానౌ॥ 1

ఓమ్ యన్మే ఛిద్రం చక్షుషో హృదయస్య మనసో వాతితృణ్ణం బృహస్పతిర్మే తద్దధాతు । శం నో భవతు భువనస్య యస్పతిః॥ 2

ఓమ్ భూర్భువః స్వః । తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి । ధియో యో నః ప్రచోదయాత్ ॥ 3

ఓమ్ కయా నశ్చిత్ర ఆ భువదూతీ సదావృధః సఖా । కయా శచిష్ఠయా వృతా॥4

ఓమ్ కస్త్వా సత్యో మదానాం మం హిష్ఠో మత్సదన్ధసః । దృఢా చిదారుజే వసు॥ 5

ఓమ్ అభీషుణః సఖీనామవితా జరితౄణామ్ । శతం భవాస్యూతిభిః॥ 6

ఓమ్ కయా త్వం న ఊత్యాభి ప్రమన్దసే వృషన్ । కయా స్తోతృభ్య ఆ భర ॥ 7

ఓమ్ ఇన్ద్రో విశ్వస్య రాజతి । శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే ॥ 8

ఓమ్ శం నో మిత్రః శం వరుణః శం నో భవత్వర్యమా । శం న ఇన్ద్రో బృహస్పతిః శం నో విష్ణురురుక్రమః ॥ 9

ఓమ్ శం నో వాతః పవతాం శం న స్తపతు సూర్యః । శం నః కనిక్రదద్దేవః పర్జన్యో అభి వర్షతు॥ 10

ఓమ్ అహాని శం భవన్తు నః శం రాత్రీః ప్రతి ధీయతామ్ । శం న ఇన్ద్రాగ్నీ భవతా మవోభిః శం న ఇన్ద్రా వరుణా రాతహవ్యా । శం న ఇన్ద్రా పూషణా వాజసాతౌ శమిన్ద్రా సోమా సువితాయ శం యోః॥ 11

ఓమ్ శం నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే । శం యోరభి స్రవన్తు నః॥ 12

ఓమ్ స్యోనా పృథివి నో భవాన్నృక్షరా నివేశనీ । యచ్ఛా నః శర్మ సప్రథాః॥ 13

ఓమ్ ఆపో హి ష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన । మహే రణాయ చక్షసే॥ 14

ఓమ్ యో వః శివతమో రసస్తస్య భాజయతేహ నః ఉశతీరివ మాతరః॥ 15

ఓమ్ తస్మా అరం గమామ వో యస్యక్షయాయ జిన్వథ । ఆపో జనయథా చ నః॥ 16

ఓమ్ ద్యౌః శాన్తిరన్తరిక్షం శాన్తిః పృథివీ శాన్తిరాపః శాన్తిరోషధయః శాన్తిః। వనస్పతయః శాన్తిర్విశ్వేదేవాః శాన్తిర్బ్రహ్మ శాన్తిః సర్వం శాన్తిః శాన్తిరేవ శాన్తిః సా మా శాన్తిరేధి॥ 17

ఓమ్ దృతే దృంహ మా మిత్రస్య మా చక్షుషా సర్వాణి భూతాని సమీక్షన్తామ్। ఓమ్ మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే । మిత్రస్య చక్షుషా సమీక్షామహే ॥ 18

ఓమ్ దృతే దృంహ మా । జోక్తే సంధృశి జీవ్యాసం జ్యోక్తే సంధృశి జీవ్యాసమ్। 19

ఓమ్ నమస్తే హరసే శోచిషే నమస్తే అస్త్వర్చిషే। అన్యాన్ స్తే అస్మ త్తపన్తు హేతయః పావకో అస్మభ్యం శివో భవ॥ 20

ఓమ్ నమస్తే అస్తు విద్యుతే నమస్తే స్తనయిత్నవే నమస్తే భగవన్నస్తు యతః స్వః సమీహసే॥ 21

ఓమ్ యతో యతః సమీహసే తతో నో అభయం కురు। శం నః కురు ప్రజాభ్యోఽభయం నః పశుభ్యః॥ 22

ఓమ్ సుమిత్రియా న ఆప ఓషధయః సన్తు దుర్మిత్రియా స్తస్మై సన్తు। యోఽస్మాన్ ద్వేష్టియం చ వయం ద్విష్మః॥ 23

ఓమ్ తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్ । పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతం శృణుయామ శరదః శతం । ప్ర బ్రవామ శరదః శతమదీనాః స్యామ శరదః శతం భూయశ్చ శరదః శతాత్॥ 24

ఇతి షట్ త్రింశోఽధ్యాయః







## 10. పరమాత్మ సూక్తము

### యజుర్వేదము 40వ అధ్యాయము
### 17 మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము
### దేవత పరమాత్మ

భగవంతుడు సృష్టిలోని ప్రతి అణువులో వున్నాడు. మనలను అన్నివైపుల నుండి చూస్తున్నాడు. అందుకే మనం పాపాలు చేయకూడదు. భగవంతుడిచ్చిన సంపదలను త్యాగభావంతో అనుభవించాలి. మనం చేసే పుణ్య పాపకర్మలకు ఫలాలను - ఫలితాలను పరమాత్ముడు ప్రసాదిస్తాడు. ఆ ఫలం మధురమైనా చేదు ఫలమయినా శిరస్సు వంచి స్వీకరించాలి. ధర్మాచరణతోనే నూరేండ్లు జీవించాలి. ఈశ్వరీయ నియమాలకు విరుద్ధంగా వ్యవహరించే వారు దుర్గతి పాలవుతారు. పరమేశ్వరుడు ఒక్కడే. ఆయన అద్వితీయుడు ఆ భగవంతుని సాక్షాత్కారం సమాహితమైన యోగికి మాత్రమే సాధ్యమవుతుంది. సర్వాంతర్యామియైన పరమాత్మను సర్వప్రాణులలో సమస్త పదార్థాలలో దర్శించే జ్ఞాని ఎవరిని అసహ్యించుకోడు. ఎవరిని ద్వేషించడు, నిందించడు. సమస్త ప్రాణులపట్ల ప్రేమను కలిగి వుంటాడు. పూర్ణయోగికి శోక మోహాలుండవు. పంచభూతాత్మకమైన ఈ జగత్తును భగవంతునిగా పూజింపకూడదు. పూజింపయోగ్యుడు సర్వజ్ఞుడైన పరమాత్ముడు ఒక్కడే.

మనుష్యుడు వేద జ్ఞానంతో శుభకర్మలు ఆచరించి జనన మరణ బంధాల నుండి తప్పుకోవాలి. అప్పుడే అమృతత్వాన్ని పొందుతాడు.

మానవజన్మ సర్వశ్రేష్ఠమైన జన్మ. మనిషి మరణించే సమయంలో మనోస్థితి ఎట్లా వుంటుందో తెలుసుకోవాలి. చనిపోయిన తరువాత మృత శరీరాన్ని భస్మం చేయాలి. ఇదే నరమేధము, నరయాగము, నరయజ్ఞమని వేదం స్పష్టం చేస్తుంది. ఆ తరువాత జీవునకు చేయాల్సిన కర్మలు సంస్కారాలు ఏమీ వుండవు. అందుకే మనుష్యుడు ప్రతినిత్యం భగవంతుని వేదోక్త దివ్యమార్గంలో నడిపించమని ప్రార్థించాలి. కుటిలమైన పాపాచరణకు దూరంగా ఉంచమని కోరుకోవాలి.

భగవంతుడు స్వయంగా తన స్వస్వరూపాన్ని - విశ్వరూపాన్ని వేదం ద్వారా వర్ణిస్తున్నాడు. పరమాత్ముడు ఆకాశం వలె అంతాటా వ్యాపించివున్నాడు. భగవంతుని మించిన మహత్ పదార్థం మరొకటిలేదు.

ఆ పరమాత్ముని నిజనామము 'ఓం'

సత్యాచరణతో భగవంతుని శరణువేడిన వారికి ఆంతర్యామి రూపంలో వున్న పరమాత్ముడు వారి అజ్ఞానాన్ని దూరం చేస్తాడు. యోగ విజ్ఞానంతో సమస్త దుఃఖాల నుండి తొలగించి వారికి మోక్ష సుఖాన్ని ప్రసాదిస్తాడు.

## అథ పరమాత్మ సూక్తమ్

## ఇదం పరమాత్మనే ఇదం న మమ

ఓమ్ ఈశా వ్యాసమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్। తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ధనమ్ ॥ 1

ఓమ్ కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః। ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మలిప్యతే నరే ॥ 2

ఓమ్ అసుర్యానామ తే లోకా అన్ధేన తమసావృతాః। తాంస్తే ప్రేత్యాపి గచ్ఛన్తి యే కే చాత్మనో జనాః॥ 3

ఓమ్ అనేజదేకం మనసో జవీయో నైనద్దేవా ఆప్నువన్ పూర్వ మర్షత్, తద్ధావతో2న్యానత్యేతి తిష్ఠత్తస్మిన్నపో మాతరిశ్వా దధాతి। 4

ఓమ్ తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే। తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః॥ 5

ఓమ్ యస్తు సర్వాణి భూతాన్యాత్మన్నేవాను పశ్యతి । సర్వభూతేషు చాత్మానం తతో న విచికిత్సతి॥ 6

ఓమ్ యస్మిన్సర్వాణి భూతాన్యాత్మైవాభూ ద్విజానతః । తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః॥ 7

ఓమ్ స పర్యగాచ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరం శుద్ధమపాప విద్ధమ్। కవిర్మనీషీ పరిభూః స్వయమ్భూర్యాథా తథ్యతో2ర్థాన్ వ్యదథాచ్ఛాశ్వతీభ్య సమాభ్యః॥8

ఓమ్ అన్ధం తమః ప్రవిశన్తి యే2సంభూతి ముపాసతే। తతో భూయ ఇవ తే తమో య ఉ సమ్భూత్యాంరతాః॥ 9

ఓమ్ అన్యదేవాహుః సమ్భవా దన్యదాహురసమ్భవాత్ । ఇతి శుశ్రుమ ధీరాణాం యేనస్తద్విచచక్షిరే॥ 10

ఓమ్ సమ్భూతిం చ వినాశం చ యస్తద్వేదోభయం సహ । వినాశేన మృత్యుం తీర్త్వా సమ్భూత్యా2మృతమశ్నుతే॥ 11

ఓమ్ అన్ధంతమః ప్రవిశన్తి యే2విద్యా ముపాసతే । తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః॥ 12

ఓమ్ అన్యదేవా హు ర్విద్యాయా అన్యదాహు రవిద్యాయాః । ఇతి శుశ్రుమ ధీరాణాం యేనస్తద్విచ చక్షిరే॥ 13

ఓమ్ విద్యాం చా విద్యాం చ యస్తద్వేదోభయం సహ।
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృత మశ్నుతే॥ 14

ఓమ్ వాయురనిల మమృత మథేదం భస్మాన్తం శరీరమ్।
ఓ3మ్ క్రతోస్మర క్లిబేస్మర కృతం స్మర॥ 15

ఓమ్ అగ్నే నయ సుపథా రాయే అస్మాన్విశ్వాని దేవ వయునాని విద్వాన్।
యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ॥ 16

ఓమ్ హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖమ్।
యో2సావాదిత్యే పురుషః సో2సావహమ్ । ఓ3మ్ ఖం బ్రహ్మ॥ 17

ఇతి చత్వారింశో2ధ్యాయః

శ్రేష్ఠులు, ధర్మపరాయణులైన విద్వాంసులు, యజ్ఞ రూపుడైన విరాట్ శక్తి పరమాత్మని అగ్నిహోత్రంతో పూజించి శ్రేష్ఠమైన యజ్ఞమయ జీవితాన్ని సాగించాలి. సమస్త సుఖాలతో రమణీయమైన జీవనాన్ని గడపాలని మానవులకు భగవంతుడు ఉపదేశిస్తున్నాడు.

ప్రాచీన ఋషులు తమ సూక్ష్మ దివ్యదృష్టితో వాతావరణ కాలుష్య నివారణకై అత్యంత శక్తివంతమైన ఆరోగ్యకరమైన ఉత్తమ ప్రక్రియను కనుగొన్నారు. అనేక గుణాలతో సంయుక్తమైన సుగంధయుక్త పదార్థాలను అగ్నిలో హోమం చెయ్యడం వలన ఏర్పడే భాష్పం పర్యావరణాన్ని రక్షిస్తుంది. వేదం అగ్నిహోత్ర ప్రాశస్త్యాన్ని విశేషంగా వర్ణిస్తుంది.

- యజుర్వేదం



# 11. అగ్ని సూక్తము

## ఋగ్వేదము 1-1-1 నుండి
## 9 మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము
## అగ్నిదేవత

సర్వ వ్యాపకుడైన పరమాత్ముడు తన అనంతశక్తి సామర్థ్యాలతో సృష్టి యజ్ఞాన్ని నిరంతరం రక్షిస్తాడు. సర్వాధారుడు, సర్వజ్ఞుడు, విధాత, నాశరహితుడు, పరమదయాళువు ఐన పరమేశ్వరుడు మానవులకు ఇతర ప్రాణులకు సుఖప్రదాత. మానవులందరు పరమాత్ముని స్వరూప స్వభావాలను తెలుసుకొని మోక్షప్రదాత యైన ఆ జగదీశ్వరునే ఉపాసించాలి.

ఈశ్వరాజ్ఞలను పాలిస్తూ ధర్మకార్యాలను ఆచరిస్తూ న్యాయమార్గమున ధనమును సంపాదించాలి. వేదాది సత్య శాస్త్రాలను చదవాలి - చదివించాలి. అందరికీ ఉపకారం చేయాలి. ఋషుల ఆదేశాలను పాలించాలి. వారే పూర్ణ విద్వాంసులు శుభ గుణయుక్తులు.

సృష్టి అనే మహాయజ్ఞాన్ని రచించి సువర్ణాది రత్నములను సృజించినవాడు, అందరిచే ఉపాసింపదగిన ఆ పరమాత్ముని భక్తితో అర్చించాలి. న్యాయము, దయ అందరిని మిత్రభావంతో చూచే పరమాత్ముని ఉపాసించి ఇహపరసుఖాలను మోక్షమును పొందాలి. ఆయనను ఎన్నడు మరువకూడదు. అధర్మాచరణ చేయకూడదు.

హే భగవాన్! తండ్రి తన సంతానమునకు ఉత్తమ శిక్షణ నిచ్చి శ్రేష్ఠ కర్మలు చేయుటకు యోగ్యులుగా చేయునట్లు నీవు మహాత్ములను కర్తవ్య ధర్మాలను పాలించునట్లు చేయుము.

## అథ అగ్ని సూక్తమ్
## (ఇదం అగ్నయే ఇదం న మమ)

1. ఓమ్ అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజమ్ - హోతారం రత్నధాతమమ్॥
2. ఓమ్ అగ్నిః పూర్వేభి ర్ఋషిభిరీడ్యో నూతనైరుత। స దేవాగ్ం ఏహ వక్షతి॥
3. ఓమ్ అగ్నినా రయిమశ్నవత్ పోషమేవ దివేదివే। యశసం వీరవత్తమమ్ ॥
4. ఓమ్ అగ్నేయం యజ్ఞమధ్వరం విశ్వతః పరిభూరసి। స ఇద్దేవేషు గచ్ఛతి ॥
5. ఓమ్ అగ్నిర్హోతా కవిక్రతుః సత్యశ్చిత్ర శ్రవస్తమః। దేవోదేవేభిరా గమత్॥
6. ఓమ్ యదంగ దాశుషే త్వమగ్నే భద్రం కరిష్యసి। తవేత్తత్ సత్యమంగిరః॥
7. ఓమ్ ఉపత్వాగ్నే దివేదివే దోషావస్తర్ధియా వయమ్ । నమో భరంత ఏమసి॥
8. ఓమ్ రాజంత మధ్వరాణాం గోపామృతస్య దీదివిమ్। వర్ధమానం స్వేదమే॥
9. ఓమ్ స నః పితేవ సూనవే అగ్నే సూపాయనో భవ । సచస్వా నః స్వస్తయే॥

*సర్వదా సత్యమే జయిస్తుంది. అసత్యానికి పరాజయం కలుగుతుంది. వేదవిదులైన విద్వాంసులు అనుసరించు మార్గము సత్యమార్గమే. సఫలమనోరథులైన మహర్షులు సత్య మార్గముతోనే భగవంతుని సాక్షాత్కారమును పొందిరి. సత్యమును మించిన ధర్మము కానీ, అసత్యమును మించిన పాపాము గానీ మరొకటి లేదు. సత్యమునకంటే శ్రేష్ఠమైన జ్ఞానమేదీ లోకమున లేదు. కనుక మానవులంతా సత్యమునే వచింపవలయును*

*- ముండకోపనిషత్తు*



## 12. రుద్రసూక్తము

### యజుర్వేదము 16 వ అధ్యాయము - నమకము
### 66 మంత్రముల సంక్షిప్త వ్యాఖ్యానము
### రుద్రదేవత

పరాక్రమవంతుడైన రాజు దుష్టులైన శత్రువులను దండించాలి. ప్రజలను ధర్మయుక్తంగా పాలించాలి. సత్యధర్మములను సేవించాలి. ప్రభువు ప్రజలను అన్ని దిక్కుల నుండి రక్షించాలి. మంగళాచరణతో కల్యాణ కర్మలను ఆచరించాలి. చంద్రుని వలె శ్రేష్ఠులకు సుఖమును చేకూర్చాలి. రాజు దుష్టులకు విరోధి. సత్పురుషులకు ప్రియుడు కావాలి. అన్నాది పదార్థములచే అందరిని ఆదరించాలి. సకల ప్రాణులకు తృప్తిని కలిగించాలి. పురుషార్థము చేసేవారిని ఉత్సాహపరచాలి. వారిని సత్కరించాలి. ప్రాణుల యెడల దయ చూపాలి. దొంగలను తాడన చేయాలి. సేవకులను కాపాడాలి. అడవులను - వనాలను రక్షించాలి. ఇవన్ని రాజపురుషుల కర్తవ్యములు.

మానవులు, గోవులు, ఆవులు, పిల్లులు, కుక్కలు మొదలైన పశువులకు ఆహారమివ్వాలి. వాటి నుండి ఉపకారం పొందాలి. అనాథలను పోషించాలి.

రాజు బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, సంన్యాసులకు శ్రద్ధతో భోజనాది పదార్థముల నిచ్చి సత్కరించాలి. వర్ణ ధర్మాలను అనుసరించాలి. చాతుర్వర్ణాల వారిని సమానంగా ప్రేమించాలి.

శిష్టాచారమునను సరించి ప్రజలందరు వేదోక్త ధర్మమును

శ్రద్ధాభక్తులతో గౌరవించాలి. దంపతులు పరస్పరము అన్యోన్యంగా ప్రసన్నంగా జీవనయాత్ర సాగించాలి. ప్రజలు శ్రేష్ఠుల సాంగత్యాన్ని వరించాలి. మానవులు ప్రేమతో భక్తితో మంగళ స్వరూపుడైన పూర్ణ పురుషునే ఉపాసించాలని ప్రజలను పాలించే ప్రభువులకు వేద భగవానుని ఉపదేశము. బ్రహ్మచారులు బ్రహ్మచర్యంతో ఆచార్యుని సేవించి వేదశాస్త్రాలను చదవాలి. చదివించాలి. సత్సంగము పరమేశ్వరోపాసన సత్యభాషణ మొదలైనవి మానవులను దుఃఖ సాగరము నుండి తరింపచేసే తీర్థములని సమస్త మానవులు గ్రహించి. తరించాలని పరమాత్ముని సందేశము.

## అథ రుద్రసూక్తమ్

## ఇదం రుద్రాయ ఇదం న మమ

ఓమ్ నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః, బాహుభ్యాముత తే నమః ॥ 1

ఓమ్ యాతే రుద్ర శివా తనూరఘోరా2పాపకాశినీ। తయా నస్తన్వాశన్తమయా గిరిశన్తాభి చాకశీహి ॥ 2

ఓమ్ యామిషుం గిరిశన్త హస్తే బిభర్ష్యస్తవే। శివాం గిరిత్ర తాం కురు మా హిం సీః పురుషం జగత్। 3

ఓమ్ శివేన వచసా త్వా గిరిశాచ్ఛా వదామసి। యథా నః సర్వమిజ్జగదయక్ష్మం సుమనా అసత్। 4

ఓమ్ అధ్యవోచ దధివక్త ప్రథమో దైవ్యో భిషక్

ఓమ్ అహీంశ్చ సర్వాఞ్జమ్భయన్త్సర్వాశ్చ యాతుధాన్యో2ధరాచీః పరా సువ। 5

ఓమ్ అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రుః సుమంగలః

ఓమ్ యేచైనం రుద్రా అభితో దిక్షు శ్రితాః సహస్రశో2వైషాగ్ం హేడ2ఈ మహే అసౌ యో2వసర్పతి నీలగ్రీవో విలోహితః। 6

ఓమ్ ఉతైనం గోపా అదృశ్ర దృశ్రన్నుదహార్యః స దృష్టో మృడయాతి నః॥ 7

ఓమ్ నమో2స్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే॥ అథోయే అస్యసత్వానో 2హం తేభ్యో2కరం నమః॥ 8

ఓమ్ ప్రముఞ్చ ధన్వనస్త్వముభయో రార్త్ని ర్జ్యామ్। యాశ్చతే హస్త ఇషవః పరాతా భగవో వప॥ 9

ఓమ్ విజ్యం ధనుః కపర్దినో విశల్యో బాణవాం2ఉత । అనేశన్నస్య యా ఇషవ ఆభురస్య నిషఙ్ గధిః॥ 10

ఓమ్ యా తే హేతిర్మీఢుష్టమ హస్తేబభూవ తే ధనుః । తయాస్మాన్విశ్వత స్త్వమయక్ష్మయా పరిభుజ॥ 11

ఓమ్ పరి తే ధన్వనో హేతిరస్మాన్ వృణక్తు విశ్వతః అథోయ2ఇషుధిస్తవారే అస్మన్నిధేహి తమ్॥ 12

ఓమ్ అవతత్య ధనుష్ట్వం సహస్రాక్ష శతేషుధే నిశీర్య శల్యానామ్ముఖా శివో నః సుమనా భవ॥ 13

ఓమ్ నమస్త ఆయుధాయానాతతాయ ధృష్ణవే ఉభాభ్యాముతతే నమో బాహుభ్యాం తవ ధన్వనే॥ 14

ఓమ్ మా నో మహాన్తముత మా నో అర్భకం మాన ఉక్ష న్తముతమాన ఉక్షితమ్ మానో వధీః పితరం మోత మాతరం మానః ప్రియాస్తన్వో రుద్ర రీరిషః ॥ 15

ఓమ్ మా నస్తోకే తనయే మా న ఆయుషి మానో గోషు మానో అశ్వేషు రీరిషః మా నో వీరాన్ రుద్ర భామినో వధీర్హవిష్మన్తః సదమిత్ త్వా హవామహే॥ 16

నమో హిరణ్య బాహవే సేనాన్యే దిశాం చ పతయే నమో నమో వృక్షేభ్యో హరికేశేభ్యో పశూనాం పతయే నమో నమః॥ శష్పిఞ్జరాయత్విషీమతే పథీనాం పతయే నమో నమో హరికేశాయోపవీతినే పుష్టానాం పతయే నమః॥ 17

ఓమ్ నమో బభ్లుశాయ వ్యాధినే2న్నానాం పతయే నమో నమో భవస్య హేత్యై జగతాం పతయే నమో నమో రుద్రాయాతతాయినే క్షేత్రాణాం పతయే నమోనమః సూతాయాహన్త్యై వనానాం పతయే నమః॥ 18

ఓమ్ నమో రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే నమో నమో భువన్తయే వారివస్కృ తాయౌషధీనాం పతయే నమో నమో। మన్త్రిణే వాణిజాయ కక్షాణాం పతయే నమో నమ ఉచ్చైర్ఘోషాయాక్రన్దయతే పత్తీనాం పతయే నమః॥ 19

ఓమ్ నమఃకృత్స్నాయతయా ధావతే సత్వనాం పతయే నమో నమః సహమానాయ నివ్యాధిన ఆవ్యాధినీనాం పతయే నమో నమో, నిషఙ్గిణే కకుభాయ స్తేనానాం పతయే నమో నమో నిచేరవే పరిచరాయారణ్యానాం పతయే నమః॥ 20

ఓమ్ నమో పఞ్చతే పరివఞ్చతే స్తాయూనాం పతయే నమో నిషఙిణ ఇషుధిమతే తస్కరాణాం పతయే నమో నమః। సృకాయిభ్యోజిఘాంసద్భ్యో ముష్ణతాం పతయే నమో నమో2సిమద్భ్యోనక్తం చరద్భ్యో వికృంతానాంపతయే నమః॥ 21

ఓమ్ నమ ఉష్ణీషిణే గిరిచరాయ కులుఞ్చానాం పతయే నమో నమః। ఇషుమద్భ్యో ధన్వాయిభ్యశ్చ వో నమో నమ ఆతన్వానేభ్యః ప్రతి దధానేభ్యశ్చ వో నమో నమ ఆయచ్ఛద్భ్యో2స్యద్భ్యశ్చ వో నమః॥ 22

ఓమ్ నమో విసృజద్భ్యో విద్ధ్యద్భ్యశ్చ వో నమో నమః స్వపద్భ్యో జాగ్రద్భ్యశ్చ వో నమో నమః, శయానేభ్య ఆసీనేభ్యశ్చ వో నమో నమస్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చ వో నమః॥ 23

ఓమ్ నమః సభాభ్యః సభాపతిభ్యశ్చ వో నమో నమో2శ్వేభ్యో2శ్వపతిభ్యశ్చ వో నమో నమ, ఆవ్యాధినీభ్యో వివిధ్యన్తీభ్యశ్చ వో నమో నమ ఉగణాభ్యస్తృం హతీభ్యశ్చ వో నమః॥ 24

ఓమ్ నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమో నమో వ్రాతేభ్యో వ్రా పతిభ్యశ్చ వో నమో నమో, గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చ నమో నమో విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ వో నమః॥ 25

